

# మిత్రభేదం

కర్త... విశ్వాత్ముల నరసింహమూర్తి



అనగా అనగా ఒక పట్నంలో
భైవ చిత్తుడను వడ్రంగి



ప్రతిదినమూతడు కట్టెలకోసం
ఊరిపక్కగల అడవికి పోవును



ఒకనాడాతడు పెళ్ళాం కట్టిన
అన్నం మూటను భుజాన వేసుకు
అడవికి పోగా సువ్యాధ్యిలోచన
మను ఒక సింహాం ఎదురైంది.



నిలువు నిలువునా కంపిస్తూనే
సింహాము నెట్లో మంచిచేసుక్కొన
దలచిన బత్తుడు మూటనువిప్పి
పిండివంటలను చూపాడు.



"మాంసాహారిని నాకెందుకు ఈ
చప్పిడి వంటలు పెడతావు?"




అదివరకే ఆ సింహాం ఎక్కడో
కడుపు నిండ తెగ మెక్కుటచేతను
పోనీ అనుకొని ఎంగిలిపడ్డది.



"భేషు భేషుగా వున్నాయోయ్!
బాగున్నాయని చెప్పు చెల్లెలికి!"




బత్తుడు రోజూ
అడవికి పోయి,
గారెలు, బూరెలు
పులిహోరా
బొబ్బట్ పెసరట్
పరమాన్నం
బజ్జీ, బోండా
పెరుగన్నం
సింహాంబావకు
పెట్టేవాడు



శాకాహారం మరిగిన సింహాం
వేటాగీటా మరచింది
సింహాం భృత్యులు నక్కా, కాకీ,
మాంసం దొరక్క, కడుపులు నిండక
కృశించటం మొదలెట్టాయి



"స్వామీ, స్వామీ మీరో
మధ్యను-మాంసం ముట్టక
వేటకు వెళ్ళక - మమ్మల
గూడా మాడ్చారు!"



సింహాం పకపక నవ్వింది :
"కొత్తగ కలిసిన మిత్రుడొక్కడూ
మంచి మంచి తిను బండారాలు
తెచ్చి యిచ్చి తినిపిస్తున్నాడోయ్!
తింటే గారెలు తినాలిగానీ
వాసన కొట్టే మాంసం దేనికి?"



నక్కా, కాకీ పక్కకుపోయి
గుసగుసలాడగ సాగినవి.
"ఎవడోగానీ ఆదుర్మార్గుడు
ఎట్లాగైనా చంపించాలి.
లేకుంటే మన నోట్లోమట్టే!"



మళ్ళీ సింహాం వద్దకు వచ్చి
"అయితే స్వామీ! మీ స్నేహితుని
చూపగూడదా మాక్కూడా?"

"చూపిస్తా మరి నాతో రండి!"



| సంవత్సర చందా |
| --- |
| రు. 12-0-0 |
| విడిప్రతిక 4 అ. |

# ఆంధ్రపత్రిక

సచిత్రవారపత్రిక

**Founder : K. NAGESWARA RAO**

| సంపుటము 45 |
| --- |
| సంచిక 1 |
| **3-9-52** |

నందన భాద్రపద శుద్ధ చతుర్దశి బుధవారము




వ. దనిక, వసంతసేన — శ్రీ. కే. శ్రీమతిగారు రచించిన రేఖాచిత్రం

(శ్రీమతి గారి చిత్రకళా ప్రదర్శనపై సమీక్ష, వారి కొన్ని చిత్రాలు 7, 44, 45 పేజీలలో చూడండి)

విషయానుక్రమణిక





# తంజావూరు ఆర్డినెన్సు

తంజావూరు జిల్లాలో కౌలుకి భూములు తీసుకుని సేద్యంచేసే రైతుల రక్షణకోసమూ, కౌలుదార్లు, పట్టాదార్ల మధ్య సఖ్యత సాధించడంకోసమూ మద్రాసు గవర్నరు ఒక ఆర్డినెన్సును ఆగస్టు 28వ తేదీని జారీచేశారు. కౌలుదార్లతోపాటు పణ్ణైయాళ్‌కి కూడా (పాలేరులని అర్థంచెప్పుకోవచ్చు) రక్షణ ఇవ్వబడింది.

1951 డిసెంబరు 1వ తేదీ తరువాత కౌలుభూములనుంచి వెళ్ళగొట్టబడిన కౌలుదార్లందరికీ తిరిగి సేద్యపు హక్కులను విధిగా ఇచ్చితీరాలని ఈ ఆర్డినెన్సు నిర్ణయిస్తున్నది. ఫలసాయంలో అయిదింట రెండువంతులకు తక్కువ కాకుండా కౌలుదార్లకు, మూడువంతులకు మించకుండా పట్టాదార్లకు వాటాలు నిర్ణయించబడినాయి.

ఇదేరీతిగా పణ్ణై (పాలేరు)లకనీసపు కూలి నిర్ణయించబడింది. వీరినికూడా పట్టాదార్లు ఇష్టంవచ్చినట్లు పనినుంచి తొలగించడానికి వీలులేదు.

పణ్ణైలను కాని కౌలుదార్లను కాని సేద్యంనుంచి తొలగించాలంటే పట్టాదార్లు రెవిన్యూ కోర్టులకు దరఖాస్తులు పెట్టుకోవాలి. ఆర్డినెన్సు ననుసరించి తంజావూరు జిల్లాలో మూడు రెవిన్యూకోర్టులు స్థాపించబడినాయి. కౌలుషరతులు సక్రమంగా అమలు జరుగుతున్నదీ లేనిదీ గమనించి ఈ కోర్టులు తీర్పులుఇస్తాయి. ఈకోర్టుల తీర్పుల మీద అప్పీలుకి గాని, ఈ ఆర్డినెన్సుకి సంబంధించిన విషయాలపై సివిల్‌కోర్టులలో ఫిర్యాదులకుగాని తావుండదు. పట్టాదార్లకు, కౌలుదార్లకు తగవులు వచ్చినప్పుడు పరిష్కారంకోసం ప్రభుత్వం మధ్యవర్తుల్ని (కన్సిలియేషన్ ఆఫీసర్లు)నియమించవచ్చు.

పణ్ణైలను పనిలోనుంచి తొలగించిన వారంరోజులలో పట్టాదారు మధ్యవర్తిత్వాధికారికి నివేదించాలి. నివేదికనుబట్టి ఈ అధికారి నిర్ణయం చేస్తారు. ఒక పట్టాదారు కౌలుదారుని తొలగించాలంటే ముందుగా రెవిన్యూకోర్టుకి దరఖాస్తు పెట్టుకుని కోర్టు తీర్పుప్రకారం బద్ధుడైఉండాలి. అంతేకాని పట్టాదారు తనంతటతానై కౌలుదారుని తొలగించడానికి వీలులేదు.

అయితే ఈ నిబంధన లేవీ ప్రభుత్వపు నీటిసదుపాయంవల్ల సేద్యంచేసే ఆరెకరాలు ముప్పైమూడు సెంట్లుకు లోబడిన భూమికల పట్టాదారుకుగాని, అట్టి నీటి సదుపాయం లేనిది ఇరవై ఎకరాలకు లోబడిన భూమికల పట్టాదారుకుగాని వర్తించవు.

కౌలుదార్లకు సేద్యపుభూమిపై హక్కులిచ్చే శాసనమేదో రాబోతున్నదని భయపడి పట్టాదార్లు కౌలుదార్లని భూమినుండి తొలగిస్తున్నారనీ, కమ్యూనిస్టుల ప్రచారమూ ప్రోద్బలాలపైన రైతులూ పణ్ణైలూ పట్టాదార్లతో తగువులకు దిగి పట్టాదార్ల హక్కులకు భంగం కలిగిస్తున్నారనీ తంజావూరు జిల్లానుంచి వార్తలువచ్చాయి. పరిస్థితి విషమించి పట్టాదార్లు కౌలుదార్లు పణ్ణైలమధ్య తగువులు పెరిగి ఆ జిల్లాలో అశాంతి ఏర్పడగలదని ప్రభుత్వం భావించింది.

ఈ ఆర్డినెన్సుతో పట్టాదార్లు కౌలుదార్ల మధ్య తగువులు తీరి సఖ్యత ఏర్పడుతుందనీ, ధాన్యోత్పత్తి పెరగగలదనీ చెప్తూ,



శ్రీ సి. రాజగోపాలాచారిగారు

ఆర్డినెన్సును దైవనిర్ణీతమైన ధర్మంగా స్వీకరించవలసిందని రాజాజీ తంజావూరు మిరాశీదార్లను ఆదేశించారు. మిరాశీదార్లు రాజాజీ సత్సంకల్పాన్ని అర్థంచేసుకుని ఆర్డినెన్సుని ప్రయోగపూర్వకంగా ప్రయత్నించి చూడ్డానికి సిద్ధంగా ఉన్నట్లు ప్రకటించినప్పటికీ చాలమంది సందేహాలు వెలిబుచ్చారు.

ఈ ఆర్డినెన్సువల్ల పట్టాదార్లు కౌలుదార్ల మధ్య తగువులూ, కోర్టు వ్యవహారాలూ అధికమౌతాయని కొందరు అనుమానిస్తున్నారు.

అయితే ఈ ఆర్డినెన్సుపట్ల పట్టాదార్ల భీతి వేరు. ఇంతవరకూ దానాదమన వినిమయ విక్రయాది సర్వహక్కులనూ, తమ జల పాషాణ నిధి నిక్షేపాదు లన్నింటిపైన పూర్తి హక్కులనూ అనుభవిస్తున్న పట్టాదారులు ఇప్పుడు కొన్ని నిర్బంధాలకు లోబడి ఈ హక్కులను అనుభవించవలసి వస్తున్నది. సేద్యం చేసే కౌలుదారుకి కూడా కొంత హక్కు వృత్తిరీత్యా సంక్రమించవచ్చేసరికి పెద్దవలకి భూమి కొన్న పట్టాదారుకి భీతి పుడుతున్నది. కమ్యూనిస్టుల ప్రచారంవల్ల ఈ రీతిగా కాంగ్రెస్ పరిపాలనలో ఆస్తి హక్కులకు భంగం కలగడంవల్ల ముందుముందు మరింత ముప్పు సంభవించగలదని భయపడుతున్నారు.

అయితే హక్కులకంటె ప్రధానమైన సమస్యను పరిగణించి కాంగ్రెస్ ప్రభుత్వం ఇవాళ కాకపోతే రేపైనా ఇటువంటి కార్యక్రమాన్ని అనుసరించక తప్పదు. దేశంలోని సంపద సర్వవర్గాల జనుల సమస్యలనూ పరిష్కరించి అందరికీ అన్న వస్త్రాలు, నివాసమూ లభింపచేయవలసిన కర్తవ్యాన్ని ప్రభుత్వం భరించదలచిన తరవాత, సమాజహితంకోసం వ్యక్తిగతమైన హక్కులను పరిమితం చెయ్యడానికి వెనుదియ్యదు.

ఆస్తి హక్కులను దేశావసరాల దృష్ట్యానే పరిగణించాలని పండిట్ నెహ్రూ అనేక పర్యాయాలు ఆదేశించారు. పంటను పండించే రైతుకు కొంతైనా రక్షణ లేకపోతే ఆహారోత్పత్తి క్షీణించిపోగల ప్రమాదం ఉన్నదని ప్రభుత్వం గుర్తించి రైతులకు రక్షణ ఇవ్వడమే కాకుండా వ్యవసాయానికి అవసరమైన పెట్టుబడి కూడా లభ్యమయేలా సదుపాయం చెయ్యడానికి కృషిచేస్తోంది. ఆస్తిపరులు దేశక్షేమం దృష్ట్యా తమ అభిప్రాయాలను మార్చుకొని ప్రభుత్వంతో సహకరించడం అవసరం. లేకపోతే రాగల ప్రమాదాన్ని గురించి వేరే చెప్పనవసరం లేదు.

ఇటువంటి ఆర్డినెన్సు హైదరాబాద్‌లో కూడా అమలు జరుపబడుతోంది. క్రమేణా ఈ ఆర్డినెన్సులు శాసనాలై రాష్ట్రమంతటికీ వర్తింపచెయ్యబడినట్లయితే దేశంలో ఆహారవస్తూత్పత్తి వృద్ధిచెంది అనేక సమస్యలు పరిష్కారం కాగలవని ఆశించవచ్చును. [29-8-52]

# రాజాజీ - స్వామీజీ

ఎక్కడపడితే అక్కడ సత్యాగ్రహాలు,
ఎటుచూసినా ఉపోషాలతో మాడినమొహాలు.
అటుచూస్తే జయప్రకాశ్, ఇటుచూస్తే సీతారాం!
ఏదిదారి దేశానికి, హరేకృష్ణ, హరేరాం!

ఏమైనాసరే రాష్ట్రం ఇమ్మని సీతారాం
చంటిపిల్లడిలాగ చేస్తున్నారు మారాం.
"హుంష్ కాకెత్తుకుపోయిం"దని నెహ్రూగారు
చర్చిల్ ఆడిననాటకమే ఆడుతున్నారు.

మీలోమీరు రాజీపడమంటారు పండిట్జీ.
రాష్ట్రం ఇస్తేగాని కుదరదని స్వామీజీ.
ఈ పేచీకి నాపూచీ లేదని రంగాజీ
రాజాజీతో కుదుర్చుకున్నారు రాజీ.

పోనీ ఎత్తేశారుగదా అనుకుంటే రేషన్
ఇంతలోకే రాజాజీ కాన్ఫిడెన్స్ మోషన్.
వెంటనే విశ్వాసం ప్రకటించి బియ్యపుధరలు
అందుకున్నాయి ఆకాశపు చివరలు.

అయితే శ్రీమాన్ రాజగోపాలాచార్యులవారు
ఇంతలోకే బెదిరిపోయేవారు కారు.
వర్తకుల హృదయపరివర్తనకై రామాయణం
ప్రతిరోజూ చేస్తున్నారు పారాయణం.

ఇంతకీ నే చెప్పేదేమిటయ్యా అంటే,
(ఎవరికీ కోపం రాకుండా ఉంటే)
రాజాజీ, స్వామీజీ అనబడే రెండురూపాలు
ఒకే పరమాత్మయొక్క భిన్నస్వరూపాలు.

—సవ్యసాచి

# రాత, కోత

**స్వత్వాలా? సత్వాలా?** ప్రస్తుత కాలాన్ని ఒకవిధంగా స్వత్వాల యుగం అనవచ్చు. తమ తమ స్వత్వాలేవో, అంటే హక్కు లేవో, ప్రజలు హఠాత్తుగా మేలుకుని వెతుక్కుంటున్నట్లు తోస్తుంది. కాని సమాజజీవనం సాఫీగా నడిచిపోడంకోసం సమాజానికి ధారపోసిన వ్యక్తిస్వత్వాలూ, వ్యక్తులకు మిగిలిన వ్యక్తిస్వత్వాలూ పాలూ నీళ్ళలా కలిసిపోయి ఉన్నందువల్ల, ఎంత వెతుక్కున్నా తీగెల్లో పళ్ళకోసం వెతకబోతే ముళ్ళు గుచ్చుకున్నట్లు అనుభవమౌతోంది సామాన్యంగా అందరికీ. మరీ పట్టుదలతో వెతికి సాధించాలనుకునేవారికి హైకోర్టు ఖర్చులు దండిగా తగుల్తున్నాయి.

సత్తావల్ల ఒక్కొక్కడు అనేకుల సత్తానీ స్వత్వాలనీ చితగ్గొట్టి అధికారం చలాయించే కాలం చాలా వెనకబడిపోయింది. ఇప్పుడు "గవుర్నమెంటు జీతం ఇచ్చుంచిన కనిస్టీబులు", కడిగేసుకోడానికి కొద్దో గొప్పో డబ్బు గలవారు చుట్టూ తిరగడానికి "పజ్యండు కోర్టులూ" ఉండడంవల్ల, చేతిలో సత్తా చూపెట్టుకోనక్కర లేకుండా నేస్వత్వాలు సాధించుకోడానికి వీలు చిక్కింది.

అయితే ఈ స్వత్వాలు అనుభవించడం మామూలు మాట కాదు. పాలనుంచి నీరు వేరు చెయ్యవలసినంత గ్రంథం ఉంది. ప్రజలు నిద్రనుంచి మేలుకోడం చాలదు తమ వైన సరుకేవో, కాని దేదో గుర్తుపట్టి, గ్రహించి అనుభవించాలి. ఇందుకోసం ఈ స్వత్వాలకి మూలమైన సంస్కృతినీ, (పరాయి) సాంప్రదాయాల్నీ, వారసత్వాన్నీ పుక్కిలిస్తున్నారు ఆధునిక భారతీయులు. కొత్తకొత్త వారసత్వాలూ, కొత్తకొత్త భావనాగతీ ఎరువుతెచ్చుకుని, కొత్త స్వత్వాల్ని అనుభవించడానికి, ఏకి తెచ్చుకున్న స్వతంత్ర ప్రతిపత్తితో స్వతంత్ర (రిపబ్లికన్) భారతీయులు జరీకండువాలు సవరించుకుంటున్నారు. ఇందుకోసం ఇంగ్లీషులో ఆలోచన్ను నెమరువేసుకుంటూ తెలుగులో పలకడం, సిరాచిలికించడం జరుగుతోంది.

ఈమధ్య వారసత్వాల మాట తల్చుకుంటే సత్తువ ఉడిగిపోయి రావుల్దప్పతున్నాయి చాలమందికి. సంక్రమించడానికి ఆస్తులు కలవారసులికిపన్ను దండిగా తగుల్తుందిట ఇకముందు. మరణసుంకాలంటూ వస్తున్నాయి ప్రాణంమీదికి. వ్యక్తుల స్వత్వాల్లో పాలుగుంజుకున్న రిపబ్లికన్ రాజ్యాంగపు కాంగ్రెస్ ప్రజాస్వామ్య ప్రభుత్వం, వారసత్వంలో కూడా పాలుకోసం చెయ్యిచాచి మరణసుంకాలంటూ విధించి వారసులికి నీరసం ప్రసాదించాలని చూస్తోంది.

కాంగ్రెస్ ప్రభుత్వం వచ్చి తెచ్చిపెట్టేంది ఇంతా అంతా కాదు నెమరువెయ్యడానికి కాదు, నోటపట్టడానికే (పావలాకిల్లీలమాదిరి) శక్యంకాని మాటల్ని తూటాల్లాగా దేశంమీదికి వదుల్తోంది—శ్రేయోరాజ్యం, (*Welfare State*), సహకారసార్థక సర్వజనహిత సంపత్కార వ్యవస్థ (*Cooperative Commonwealth*) వగైరా వగైరా అంటే—

సర్వజనులికీ శ్రేయోదాయకమైన పరిపాలనావిధానం అని ఒకమాటకి అర్థం చెప్పతున్నారు. పెచ్చుమీరిన భాగ్యవంతుల భాగ్యాన్ని చపటాచేసి, ఊబిలా దిగదీసుకుపోయిన నిర్భాగ్యుల దారిద్ర్యాన్ని గట్టి మన్నుతో పూడ్చి, మొత్తానికి సంపద అందరికీ ముటలాగ ఒక కంటచూస్తూ, రెండో కంటితో ఈ చదునైన వ్యవస్థని (అచ్చ తెలుగులో అవస్థని) ఏకమొత్తాన పైకీ పైపైకీ ఉద్ధరించే ఉపాయాలు కనిపెట్టి చూడ్డం మరోమాటకి అర్థం చెప్పకోవచ్చు. నిజానికి అర్థం ఎలా చెప్పకున్నా తెలుగులోకి వడబోద్దామని తంటాలు పడితే దిగేసరుకు మళ్ళీ ఇంగ్లీషు భావమే మిగుల్తోంది.

వడపొయ్యగా మిగిలేది ఇంగ్లీషైనా తెలుగైనా ఆట్టే ఇబ్బంది ఉండకపోను; కాని తీరా రుచిమాడబోతే చేదు చేదుగా ఉంటోంది కొందరికి. కారణం ఆ కొందరికి కొమ్ముచెంబు కొమ్ముల్లో మీసాల గురువు (స్టాలిన్) తొంగి చూస్తున్నట్లు అనుమానం కలుగుతోంది. పుల్లతో పొడిస్తే పోగా మిగిలింది పురాణాల్లో ఏ కాక్షి అయితే, ఇప్పుడు మిగిలేది నాజీల మాజీగురువు అర్థమీసాలు కావచ్చు.

ఈ ఇంగ్లీషుమాటల వడపోతమూలంగా ఇప్పుడు ఆస్తివారసత్వాలు గొప్పా, వృత్తి సహజస్వత్వాలు గొప్పా అనే సమస్య ఒకటి బయలుదేరింది. నోటపట్టని పై మాటల్ని గమనించి మన్నిస్తే, వారసత్వాలు నీరసించి స్వత్వాలకి సత్తా చిక్కేలా 'కనపడుతూంది.' కాని అటు వారసత్వాలు మరీ నీరసించి నీరు కారిపోకుండానూ, ఇటు స్వత్వాలు మరీ బలిసి బరితెగించకుండానూ, ఉభయుల్నీ ఒకే చెరువులో నీరుతాగించే సదుపాయంకోసం తంజావూరు ఆర్డినెన్సు అంటూ ఒకటి సర్వతంత్ర ప్రభాసంపన్నులైన శ్రీ రాజగోపాలాచార్యులుగారు జారీ చేయింపించారు. ఇది సార్థకమైతే అనర్థం ఉండబోదన్ని శ్రీవారి పరమాశయం. ఈ పరమపదంచూసి మీసాలగురువుగారి శిష్య ఆమ్రేడితాలు మురిసిపోతున్నారేకాని పజ్యండు కోర్టుల పైన అపీలులేని మరోకోర్టు పొంచివుందనీ, ఆస్తి వారసత్వానికి ఎగనామం పెట్టాలని చూసే వృత్తిస్వత్వాలకి ఆ పొంచివున్నది పంగనామం పెట్టగలదనీ వారు గ్రహించలేదు పాపం.

★

ఇద్దరు స్నేహితులు బీచిలో కూర్చున్నారు. ఒకడు ఏమీమిటో మాట్లాడుతూ గంటనుంచీ రెండోవాణ్ణి విసిగిస్తూ మధ్యలో ఆగి ఇలాఅన్నాడు

"ఏం బ్రదర్. ఇంకా కాసేపు హాయిగా కూచుందామా, పోదామంటావా?"

"హాయి అనేది మరిచిపోయి గంటసేపైంది. ఇక కూర్చున్నా ఒకటే, వెళ్ళిపోయినా ఒకటే"

★

# ఏనుగులు

"ఏనుం గెక్కినవాడు కుక్కలకు దానేరీతిగా జంకక
త్యానందంబున నేగునో—"

ఇది శ్రీ వద్దాది సుబ్బారాయుడుగారు రచించిన "భక్త చింతామణి"లోని ఆణిముత్యంవంటి పద్యం ఏనుగమీద ఎక్కినవాడు ప్రక్కనున్న కుక్కలు ఎంత మొఱిగినా లెక్కచేయడు. అలాగయితే కుక్కలు ఎందుకు మొఱగడం? అని ప్రశ్నిస్తే ప్రయోజనంలేదు. అది వాటి సహజస్వభావం. ఆవు "అంబా" అనును. పిల్లి "మ్యావు మ్యావు" అనును. మేక "మ్యా" అనును. అదేవిధంగా కుక్క మొఱుగును. కాని, కుక్కలు మొఱిగినప్పటికీ వాటిని లక్ష్యంచేయకుండా గజానికొక అంగవేస్తూ మజాగా నడచేది మదగజం. అయితే మొఱిగే కుక్కలు కరవజాలవు. ఇది జగమెరిగిన విషయం అయినప్పుడు గజమెరిగిన విషయం కూడా అయి ఉండాలి. మొఱిగే కుక్కలు కరవజాలవని తెలిసినప్పుడు, నిర్భయంగా కాలినడకనే, కావలిస్తే కఱ్ఱ చేతబట్టుకొని, పోవచ్చు. ఆవిధంగా అందరితోబాటు బాటమీద హాయిగా నడచిపోతూఉంటే మనలను చూచి కుక్కలు మొఱగనే మొఱగవు. కొత్త పద్ధతిగా కొండంత వాహనంమీద ఎక్కి దండయాత్రకు బయలుదేరినట్లుగా వెళ్లినప్పుడే కుక్కలు మొదలైనవి భయంతో "బొయ్ బొయ్" అని వెంటపడడం సంభవిస్తుంది. దీనిని బట్టి చూస్తే, ఏనుగుమీద ఎక్కి వెళ్ళకుండా ఉన్నట్లయితే, కుక్కలు వెంటబడడం మొఱగడం అనేదికూడా సంభవించదు. మిగిలిన జనులందరూ రాజబాటమీద నిరాఘాటంగా నడుస్తున్న విధంగానే నడిస్తే ఒక్క కుక్క కూడా మనదిక్కు చూడదు. కాబట్టి మనం ఏనుగెక్కడం ఎందుకు? ఆ ఏనుగును చూచి వీధిలో కుక్కలు విపరీతంగా మొఱగడం ఎందుకు? ఈ వెఱవ కుక్కలు ఎంత మొఱిగినా నాకేమీ భయంలేదని తనకు తాను ఆత్మధైర్యం చెప్పుకొనడం ఎందుకు? హస్తిపై కెక్కడమే తనకు అభయహస్తం చిక్కడం అని భావించడం శుద్ధచాదస్తం.

ఇదంతా ఎట్లా ఉందంటే, జీవరాసులలోకెల్ల ఉత్తమోత్తమమైన జన్మఎత్తినమానవుడు అనవసరంగా కుక్కలకు భయపడి, ఏనుగును శరణుజొచ్చి, ఆ ఏనుగుమీదఎక్కి, కుక్కలను కవ్వించి భయపెట్టి మొఱిగేటట్లు చేసి, తాను ఏనుగుమీద ఉన్నంతకాలమూ యీ కుక్కలు తన్నేమీ చేయజాలవని తన గుండెదడ తాను తగ్గించుకొని, "అమాతంగం మీదనుంచి క్రిందికిదిగి వస్తే మాత్రం ఏదీ గతినాకు?" అనే భయంతో కంపిస్తూ ధైర్యంగా దానిమీదనే కూర్చుండి, తాను కుక్కలకంటె ఎక్కువైనవాడినని లెక్కించుకుంటూ, కరిరాజునాశ్రయించి, తిరిగీ కరిరాజుకు సరివాడనని కూడా ఎంచక పైవాడనని గర్వించడమే ఈ మానవప్రవర్తనయొక్క పరమార్థంగా అంతరార్థంగా బోధపడుతోంది.

# దాసు వామనరావు

ఇదంతా కారణంలేని కంగారుగా ఉంది. తనభీతికి తానే విభూతి పెట్టుకున్నట్లుంది తన తుమ్ములకు తానే "చిరంజీవి" యన్నట్లుంది.

కాని, యిటువంటి ఆత్మప్రబోధం ఆవేదనపడేవానివిషయంలో ఆరున్నరశ్రుతిలోకికూడా వెడుతుంది. "మనమా! వద్దిక నాదుమాట వినుమా! మర్యాద గాపాడుమా!" అనే పల్లవితో శ్రీ చెళ్లపిళ్ల వెంకటశాస్త్రిగారు రచించిన "శ్రవణానందం"లో కొన్ని దివ్యమైన పద్యాలు వ్రాశారు పరస్త్రీలోలుడైనవాడు నిజంగా ఆపద్యాలు ప్రతిరోజూ భగవద్గీత పారాయణం చేసినట్లుగా పఠించవచ్చు.

"లక్ష్మీనృసింహ మమ దేహి కరావలంబం" (ఓ లక్ష్మీనరసింహమా! నీ చేయూత నాకు యిమ్మ!") అనే ధ్యానశ్లోకాలలో శ్రీ శంకరాచార్యులవారు ఒళ్లు కాలిపోతున్న సమయంలో తన ఆత్మావేదనను కర్ణరసాయనంగా లోకానికి సమర్పించారు — ఆయనకూడా కామసూత్ర రహస్యాలు తెలిసికొనడానికి ఒకప్పుడు పరకాయ ప్రవేశం చేశారని అంటారు — ఆ కథాఘట్టంలోనే ఆయన స్వీయ శరీరానికి అగ్నిసంస్కారం జరిగిన సమయంలో ఆయన ఆవేదన యీ శ్లోకాలలో నివేదించారు. ఆ శ్లోకాలు చదువుకుంటే ఎటువంటివానికైనా ఆత్మప్రబోధం కలిగి, ఆత్మధైర్యం కలిగి శంకరాస్వాములవారి వలె ఆత్మతత్వవేత్త కావచ్చు. "శ్రవణానందం" చదివి, అందులోని ఆత్మప్రబోధక పద్యాలు నిత్యపారాయణము చేసినవాడు జ్ఞానియై ఏ శ్రవణానందస్వామిగానో తయారు కావచ్చు. పరస్త్రీల వెంటబడి పరకాయ ప్రవేశం చేయవద్దు ఓ మనసా! అని చెంపపెట్టు పెట్టినట్లుగా చెళ్ళపిళ్ళ శాస్త్రిగారు ఆ పద్యాలు వ్రాశారు

"ధనమాపోవును; మానమా చెడును;
నిందా నెత్తిపైకెక్కు; లో
కనుమానింతురు తల్లిదండ్రులు;
కులంబా వెన్నకుందక్కు; నూ
తన మాంద్యమ్ము ఘటిల్లు; బంధుగులు
పంతంబొప్ప నిందింతు; రో
మనమా! వద్దిక నాదుమాట వినుమా
మర్యాద గాపాడుమా!"

ఈపల్లవితో ఆత్మప్రబోధం జ్ఞానప్రబోధం కలిగించే 12 పద్యగుళికలుగల శ్రవణానందం వంటి గ్రంథం చదివి, అందునా యిందునా కాకుండా ఇహపర దూరులై దుష్టులై పోతారనిన్నీ, అది చదివినవాళ్ళూ, విన్నవాళ్లూ, అచ్చువేసినవాళ్లూ, అటు ఏడుతరములు, ఇటు ఏడుతరములు రౌరవాది మహానరకముల పాలైపోతారనిన్నీ ఆనాటి అధికారులు ఆ గ్రంథానికి ఆంక్షవేశారు. ఈ ఆంక్షా విమోచన అయ్యేటప్పటికి, అహల్యా శాపవిమోచనకోసం శ్రీరామచంద్రుడు అవతరించినంత పని అయింది.

చెళ్ళపిళ్ళ వెంకటశాస్త్రిగారు జీవించినన్నాళ్ళు కవి సింహం లాగున కాలము గడిపారు. "కుకవీంద్ర ఘటా పంచానన" (అల్ప కవీంద్రులనెడి (ఘటా) ఏనుగుల సమూహానికి సింహంవంటివాడు) అనే అర్హమైన బిరుదు ఆయనకు ఉండేది. ఆయనను మన స్వరాజ్యప్రభుత్వం వచ్చిన తర్వాత మద్రాసు ప్రభుత్వంధ్రాస్థాన కవిగా ప్రతిష్ఠించి సన్మానించారు. కాని, అంతకు పూర్వమే నానారాజ సందర్శనం చేసి అనేక సన్మానాలు అఖండవైభవంగా పొందిన వారి కీర్తి మిన్నందినది. "ఏనుగునెక్కినాము, ధరణీంద్రులు మ్రొక్కగ నిక్కినాము, సన్మానము లందినాము, బహుమానముల గ్రహియించినార మెవ్వారిని, లెక్కసేయక నివారణ దిగ్విజయంబు నందినార" మని సగర్వంగా చాటించారు. ఆ మాటకువస్తే అల్లసాని పెద్దన్నగారు కూడా రాయలవారిచేత మన్ననలుపొంది మహానందభరితుడై ఏనుగెక్కినాడు.

శ్రీకృష్ణదేవరాయలు వసివీధిలో తాను దిగి స్వయంగా ఆయన చేయిపట్టుకొని తన పట్టపు ఏనుగుమీద ఆయనను ఎక్కించినాడట "ఏనుగెనచో తన మదకరీంద్రము డిగ్గి కేలూత యొసగి యెక్కించుకొనియె"— ఇంతకన్నా ఎక్కువైన గౌరవం ఎక్కడ ఉంది ఆంధ్ర సారస్వతప్రపంచంలో?

అప్పటి ఆంధ్ర సాహిత్యమే ఉచ్చదశకు వచ్చి, ఉచ్చస్థాయి నధిరోహించి గజారోహణం చేసింది. అటుపిమ్మట ఈ ప్రౌఢకవిత్వం గజంమూరమైనా ముందుకు సాగిందా అని అనుమానం కలుగుతూ ఉంటుంది. కాని చాలా మెల్లిగా గజగమనం చేస్తోందేమో చెప్పలేను. ఆంధ్రభాషా యోషకుకూడా మెల్లి మెల్లిగా అడుగులు వేయడంలోనే అందం చిందులు త్రొక్కుతూ ఉంటుందని కొందరి మతం కావచ్చు. దివ్యమైన కావ్యం, రససిద్ధుడైన కవి, శతాబ్దానికొక శాఖ చొప్పున అవతరించినా చాలునంటారు సాహితీ మద గజగామినీ ఉపాసకులు. ఆంధ్ర భాషాయోషకూడా గజేంద్ర మోక్షంలోని శ్రీ మహాలక్ష్మి లాగున "అడుగిడు నడుగిడదు జడిమ నడుగిడు నెడలన్" అన్నట్లుగా నడక సాగిస్తే అదే సరియైన యింపుసొంపుల పెంపు అని వారి తలంపు. సంగీతం, సాహిత్యం యివి రెండూ కూడా మన ఆంధ్ర సరస్వతికి సమ వికాసంతో విస్తరించిన పాలిండ్లవంటివే. త్యాగరాజుగారి సంగీతం పోతరాజుగారి కవిత్వం ఆంధ్రసరస్వతిని కంట తడి పెట్టనీయకుండా చేశాయి. "కాటుక కంటినీరు చనుకట్టు పయిన్ బడ నేల యేడ్చెదో హాటక గర్భురాణి!" అని బమ్మెర పోతన్నగారు అన్నారు

'హరిభక్తి హస్తిరాజు, బమ్మెరపోతరాజు" ఆ విషయంలో గోపరాజుగారు కూడా ఎంతమాత్రమూ తక్కువ మెట్టులోని వారు కారు "రామమూర్తికిన్ రెండవసాటి దైవమిక లేడనుచున్ గడగట్టి భేరికాదాండడ డాండడాండ నినదంబులజాండమునిండ మత్తవేదండము నెక్కి చాటెదను దాశరథీ కరుణాపయోనిధీ" అన్నారు. ఏనుగు ఎక్కి చాటినా చాటకపోయినా గజరాజుకంటె అనేక గజాల ఎత్తయిన భద్రాచలం కొండమీదనుంచి ఆయన రామభక్తి ఆల్ ఇండియా రేడియోకంటె అమోఘంగా ప్రసారం అవుతోంది.




"తల్లీ నిన్ను దలంచి పుస్తకము చేతం బూనితిన్" అని తెనుగుబిడ్డలచేత యీ రోజువరకు పోతరాజుగారు చేసిన సరస్వతీప్రార్థన ఆవిధంగానే చేయిస్తున్నాము. ఆ సాహిత్య సరస్వతికి "మాతృదేవోభవ" అని, ఆ తల్లి పాలుత్రాగి, ప్రాచీనాంధ్ర సారస్వతంలోని "చిక్కనిపాలూ మీగడలు" రుచి చూచినప్పుడే క్రొత్తగాపుట్టే బాలకవులు గాని, కవికిశోరులు గాని పుష్టిగా ఉంటారు. స్వీయ సాహిత్య రసానుభవం లేకుండా అన్య సాహిత్య రసానుభవంతో పెరిగిన వాళ్లు దాది పాలతోను, డబ్బా పాలతోను పెరిగిన బిడ్డలు లాగున తయారవుతారు. సింహబలమూ రాదు ఏనుగ బలమూ రాదు. కవి కంఠీరవములూ కవి కరీంద్రములూ ఉద్భవించవు కాని అల్పజ్ఞులై ఆవిర్భవించే అర్భకులకు ఏనుగంత బలం లేకపోయినా, ఏనుగంత గర్వం ఉంటుంది.

"తెలివి యొకింత లేనియెడ దృప్తుడనై కరిభంగి సర్వమున్ దెలిసితినంచు గర్వితమతిన్ విహరించితి దొల్లి" అని చిట్టచివరకు పశ్చాత్తాపంతో అ శమిస్తారు పాత కవిత్వం అంతా కూడా ప్రశస్తమైన పాతర వేసిన ధాన్యం అని వాదించడం లేదు కాని, పాతది అంటే బూజుపట్టిందనీ, దానిమీద మోజు తీరిందనీ వాదించడంలో అర్థం లేదు. జగత్తుకు పాత లేదు. సృష్టి స్థితి లయాలకు పాత అనేది లేదు. ఋతువులకూ పాత లేదు. కవిబ్రహ్మలు, రససిద్ధులు కూడా అంతే. "సుకృతాత్ములు రససిద్ధులు—సుకవీంద్రులు .. ప్రకట జరామరణ జన్మభయరహితంబుల్"

కాని ఈ జగత్తు అంతా మిథ్య అనే వాళ్ళతో వాదించలేము "గజం మిథ్య పలాయనం మిథ్య" అని ఒప్పుకోలేకపోయినాడు ఒక మిథ్యావాది. ఏనుగు వెంటబడి తరుముతూ ఉంటే, "ఏనుగు" అనేది మిథ్య కాదన్నాడు. తాను పలాయనం సాగించడం కూడా మిథ్య కాదన్నాడు. ఏనుగు అంతటి జంతువే మిథ్య అయితే, యింకేముంది? ఈగలు దోమల గతి ఏమిటి?

ఒక అమెరికను క్రయిస్తవపాదిరీ యీ దేశంలో క్రీస్తుమత ప్రచారం చేస్తూ ఉండేవాడు. అతడొక పత్రికను ప్రతి మాసం యీ దేశంలోనే అచ్చువేసి, భారత దేశాన్ని గూర్చి భారతీయులను గురించి ఆ పత్రికలో తనకు తోచిన అభిప్రాయము వ్రాస్తూ ఉండేవాడు—ఒకసారి ఆ పత్రిక పై అట్టమీద పెద్ద ఏనుగు బొమ్మను ముద్రించి, ఆ ఏనుగు బొమ్మక్రింద "భారత దేశం అంటే ఇదే" అని వ్రాశాడు. ఆ పాదిరీ ఊహ ఏమిటంటే, ఇది ఏనుగంత దేశం, ఏనుగంతజాతి అయినప్పటికీ, బ్రిటిష్ సింహం చిన్నదైనా, ఆ బ్రిటిష్ సింహాన్ని చూచి హడలిపోతూ ఉంటుంది అని వెల్లడించాడు.

కాని, భారతదేశం అంత ఏనుగ మా ఏటుబడిలో ఉంది గనుక మా బ్రిటిష్ సామ్రాజ్యం అంతటి సామ్రాజ్యం జగత్తులో యింకెక్కడా లేదు అని బ్రిటిష్ వారు చాటించుకున్నారు ప్రపంచంలోని యితర రాజ్యాలవారు ఎంత బెదరించినా, ఎంత మొఱిగినా బ్రిటిష్ సింహం లక్ష్యం చేయదన్నారు కారణం ఏమిటి? "ఏనుంగెక్కిన వాడు కుక్కలకు దా వేరీతిగా జంకకత్యానందంబున నేగునో" ఆవిధంగానే బ్రిటిష్ వారు వ్యవహరించారు

హస్తినాపురంలో అధికారాన్ని లండనులో ఉండే ఇండియా కార్యదర్శి కబంపట్టి చలాయించాడు. "ఎలుకలు తమ కలుగులోకి ఏనుగు నీడ్చెన్" అన్నట్లయింది. ఇది ఎట్లా జరిగిందంటే

"ఇలలో ఇద్దరు రాజులు
మలయుచు చదరంగమాడి మాపటివేళన్
బలమెత్త మరచిపోయిన
ఎలుకలుతమ కలుగులోకి ఏనుగునీడ్చెన్."

అదే విధంగా యీ దేశంలో ప్రతిప్రాంతంలోను ఎవరో యిద్దరు రాజులు కలహించి చదరంగపు ఎత్తులు వేసి ఆఖరుకు తమ సైన్యాలను బ్రిటిషు వారికి అర్పితం చేశారు వెలెస్లీ ప్రభువు కాలంలో వారి సైన్యాలు ఈస్టుయిండియా కంపెనీవారికి అర్పితం అయినాయి డాల్ హౌసీ ప్రభువు కాలంలో వారి సంస్థానాలు అర్పితమైనాయి ఆఖరుకు దిగ్దంతులవంటి మహారాజులందరూ బ్రిటిష్ వారికి లొంగి వంగి గులాములై సలాములు చేశారు—'కుంజరయూథంబు దోమకుత్తుక జొచ్చెన్' అన్నట్లయింది.

"కంజనవేడి పాండవులరి
భంజనులై విరటుగొల్వ పాల్పడి రకటా!
సంజయ! విధి నేమందును?
కుంజరయూథంబు దోమకుత్తుక జొచ్చెన్"

ఏనుగులమంద దోమ కంఠంలో దూరినా ఎంత కాలం అలా ఉండగలదు? ఏనుగ ఎక్కడ? దోమ ఎక్కడ? హస్తిమశకాంతరం అది "కరిరాజున్ బిసతంతు సంతతులచే గట్టన్ విజృంభించు" నన్నట్టుగా భారతదేశంవంటి గజేంద్రుణ్ని తామరకాడలోని దారాలతో కట్టినట్లుగా మాంచెస్టరు మిల్లుదారాలతో కట్టవలెనని ప్రయత్నించారు. అదిన్నీ గాక, ఇంగ్లండు



చంద్రశేఖర

చిత్రకారిణి వై. ఎ. శ్రీమతి.

ఎక్కడ? ఇండియా ఎక్కడ? రెంటికీ బహు శతయోజనాల అంతరం ఉంది. ఇది వారికి అందరాని ద్రాక్షపండు. వారి గొంతుకలో పచ్చి వెలక్కాయలాగున ఉంటూవచ్చింది. ఆఖరుకు గత మహాసంగ్రామంలో వారి సామ్రాజ్యం ఏనుగు మింగిన వెలగపండులాగున గుల్లయై డొల్లయై కల్లయై హరించిపోయింది. 100 సంవత్సరాలు అనగా ఒక శతాబ్దం వారితో మనం శతమతం అయినాము "కరి మకరికి మకరి కరికిని" అన్నట్లుగా మన స్వాతంత్ర్య సమరం సాగించాము. వారు లాఠీచార్జీలు చేశారు. నానాహింసలు పెట్టారు "లా వొక్కింతయు లేదు" అనే స్థితిలోకి మనం వచ్చాం. గాంధీనాయకత్వంలో గజేంద్ర మోక్షం అయింది. యీ భారతభూమికి

మహాసంగ్రామం వచ్చింది. బ్రిటిష్ సింహం అహం, సామ్రాజ్య వ్యామోహం పోయి భారతమాతతో నాకు కావలసింది స్నేహం అంది. ఇతర గ్రామసింహాలు, గ్రామసింహాలుగానే ఉన్నాయి. ఈ ఏనుగు యింకా ఏనుగులాగానే ఉంది యింకా నల్లమందు మాత్రలు మింగుతూ "కలడు కలండనెడు వాడు కలడో లేడో" అనే స్థితిలో ఉంది. తన భారత జాతీయ ఆత్మసంస్కృతి ఏమిటో తన పూర్వవిజ్ఞానవికాసం ఏమిటో ఇంకా తెలిసికోలేదు. అసలు భారతీయ సంస్కృతి అనేది ప్రత్యేకంగా విశిష్టంగా ఒకటి ఉందంటారుగాని "కలదు. కలదనేది కలదో లేదో" అని అనుమానిస్తున్నాడు ఇంకా మన జవహరిలాలు నెహ్రూ - అస్తి నాస్తి విచికిత్సలో ఉన్నారు మన విద్యావంతులు చాలమంది కాని, జపాను, అమెరికా మొదలైన రాజ్యాలకు పండిత నెహ్రూగారు భారతదేశ జ్ఞాపకార్థంగా ఏనుగు గున్నలను మనజాతీయచిహ్నంగా పంపించి బహూకరించారు. నెహ్రూగారి సొంత రాష్ట్రమైన ఉత్తరప్రదేశ్‌లో ఏనుగులకు నాగళ్ళుకట్టి పొలాలు దున్నించవలెననే గజయత్నం, గజకృషికూడా జరుగుతోంది. దీనితో గజపంట పండిస్తారని ఆశగాఉంది. దానితో దేశమంతటా లక్ష్మి అనగా నిజమైన గజలక్ష్మి ప్రసన్నం కావాలి.



మా ఊళ్ళో సత్యం అనే ఒక ఆర్య వైశ్య కుమారుడు ఉన్నాడు. పాతికేళ్ళ వాడు-బక్కగా పల్చగా ఉంటాడు. అతని భార్య 'స్వరాజ్యం' ఇంకా కాపురానికి రాలేదు. ఈ వైశ్యకుమారుడు కుబేరుడు కావాలనే ఆశతో గజలక్ష్మి విగ్రహానికి పట్టుదలగా పూజలు సాగించాడు. ఎప్పుడు చూచినా—

"లక్ష్మీం క్షీరసముద్రరాజ తనయాం
శ్రీరంగ ధామేశ్వరీం
దాసీభూత సమస్తదేవ వనితాం
లోకైక దీపాంకురాం
శ్రీమన్మంద కటాక్షలబ్ధ విభవ
బ్రహ్మేంద్ర గంగాధరాం
త్వాం త్రైలోక్య కుటుంబినీం సరసిజాం
వందే ముకుందప్రియాం"

అనే ధ్యానశ్లోకం సదా చదువుతూనే ఉంటాడు ఇతని గజలక్ష్మి ఉపాసన రోజు రోజుకు ఎక్కువైపోయింది. ఎక్కడ గజలక్ష్మి బొమ్మ కనిపిస్తే అక్కడ సాష్టాంగ ప్రణామం చేయడం సాగించాడు. అతని బంధువుల యింట్లో యీమధ్యనొక వివాహం జరిగినప్పుడు సత్యం కూడా వెళ్లి ఆరాత్రి పాటకచ్చేరీలు విందు భోజనాలు అయిన తర్వాత పెళ్ళిపందిరలోనే బంధుజనంతో కలిసి యితనుకూడా నిద్రపోయినాడు. గ్యాసులైట్లు వెలుగుతూనే ఉన్నాయి. కాని, ఒక రాత్రివేళ ఎందుకో లేచాడు. సమీపంలోనే ఒక పెద్ద అమ్మాయి గజ్జెల వడ్డాణం పెట్టుకుని అరమోడ్పు కనుదోయిగా నిద్రపోతోంది ఈ అమ్మాయి పేరు వరలక్ష్మి-వయసువచ్చి ఒళ్లు వచ్చిన పడుచుపిల్ల. సత్యానికి మరదలు వరస అని తెలిసింది. ఆ అమ్మాయి వడ్డాణం గజ్జెల మధ్య కెంపులు పుష్యరాగాలతో చక్కగా చెక్కిన గజలక్ష్మి బొమ్మ ధగద్ధగాయమానంగా ప్రకాశిస్తోంది. దాన్ని చూచిన వెంటనే సత్యానికి పరవశత్వం వచ్చింది. దేహం పులకరించింది. అక్కడ ఆ నిద్రావస్థలోపరున్న గజగామినిదగ్గర, ఆ వడ్డాణంమీదవున్న ఆగజలక్ష్మివద్ద సాష్టాంగ ప్రణామంబు లాచరించి "లక్ష్మీంక్షీర సముద్రరాజ తనయాం...సరసిజాం వందే ముకుంద ప్రియాం" అనే ధ్యానశ్లోక పఠన ప్రారంభించాడు. ఇదంతా విని హఠాత్తుగా నిద్రలేచిన ఆ హస్తిని అతని భక్తికి మెచ్చినదో యన్నట్లుగా అతని శిరస్సుపై తన హస్తముంచి "లెమ్మ! లెమ్మ"ని గట్టిగా రెండు మొట్టికాయలు ప్రసాదించి అతనికి జ్ఞానప్రబోధం కలుగజేసింది. తన ఎడమ పాదంకూడా అతని మీద ప్రయోగించి అతనిని ఆయోగనిద్రలో నుంచి లేపింది. గజలక్ష్మి ఉపాసన చేసిన సత్యం ఆదెబ్బతో గజగజలాడిపోయినాడు. ఆ బంగారుగజ్జల వడ్డాణంమీద కన్ను వేసినాడని కొందరన్నారు. కేవలం గజలక్ష్మి ఉపాసన చేశానని సత్యం అంటాడు. కాని నిజం ఎవరికి తెలుసు? సత్యమేవ జయతే. సత్యమే జయించుగాక!

మన సత్యమును తన్నినభామ సత్యభామ అంతటిమహారాణికాకపోయినప్పటికీ, వామపాదంతోనే తన్నడం కామసూత్రాలకు విరుద్ధం కాదన్నారు పెళ్లికి వచ్చిన పెద్దలు. కాని, ఎవరి ఆత్మభక్తి విశ్వాసములను అనుసరించి వారు తమ యిష్టదేవతలను ఆరాధించుకోవచ్చునని భారతీయులందరికీ స్త్రీపురుషలింగ విభేదం లేకుండా సమాన సమారాధన హక్కు భారత రాజ్యాంగ చట్టంలో ఇవ్వబడి ఉంది. ఇది తన్నితే పోయేహక్కు కాదు. ఇది తుమ్మితే ఊడేహక్కు కాదు. ఇది మన ప్రజాధిపతిచే కాపాడబడే ప్రాతిపదిక హక్కు. అటువంటి సందర్భంలో మన సత్యం హైకోర్టులో ఒక్క రిట్ పిటీషను దాఖలు చేసి సుప్రీం కోర్టుకు అప్పీలు చేయడానికి పర్మిట్ కూడా పొందవచ్చు. సుప్రీంకోర్టులోని మహాజన ప్రభృతులు సత్యానికి అనుకూలంగా తీర్పు చెప్పగలరనుట సత్యం— కాని, "సత్యమేవ జయతే" అనే నమ్మకం సత్యానికి ఉంది. కనుక తన్నినవారి కాలికే తప్పక నొప్పి కలుగగలదనిన్నీ అదే ప్రహరణానికి తగిన ప్రాయశ్చిత్తం అనిన్నీ అతని నమ్మకం

అతనిమీద వరలక్ష్మి కూడా ఆగ్రహించడానికి అవకాశం లేకపోలేదు. అతను "లక్ష్మీం క్షీరసముద్రరాజ తనయాం" అనే ధ్యానశ్లోకం చదివినప్పుడు "లక్ష్మీం" అని ధ్యానం చేశాడు గాని, "వరలక్ష్మీం" అని ధ్యానం చేయలేదు. ఈ మాట నిజం. "వర" శబ్దవిహీనంగా వరహీనంగా అతడు చేసిన ధ్యానం అధ్యాన్నంగా ఉందనే కారణంచేతనే ఆమెకు మొదట ఆగ్రహం వచ్చిందట. ఈ విషయం ఆమె చెలికత్తెలిద్దరితో ఏకాంతంగా యాదాలాపంగా అన్నదని అభిజ్ఞవర్గాల ద్వారా రూఢిగా తెలిసింది. సత్యం విషయంలో సత్యం బయటపడింది. అతనికి "స్వరాజ్యం" వచ్చిన తర్వాతనైనా "సత్యమేవ జయతే." అనేమాట నిశ్చయం.



సీరియల్ నవల

# రెండు మహానగరాలు

చార్లెస్ డికెన్స్

## 30

అగాథాలలాంటి అగడ్తలు, వాటిమీద రెండు పెద్దపెద్ద మడతవంతెనలు, చెక్కుడురాతితో నిర్మించిన అభేద్యమైన దుర్గం, తొమ్మిది కోటబురుజులు, బురుజు బురుజునా ఫిరంగులు, తుపాకులు—ధూమం, అగ్ని జ్వాలలు! ఆ పొగలలోనూ మంటలలోనూ, కోటకు యెదురుగా నిల్చుని, పానశాల యజమాని డిఫార్జ్ ఫిరంగి పేలుస్తున్నాడు. జీవితమంతా సైనికవృత్తిలో వున్న ఆరితేరిన యోధుడులా ఆవేశంతో పనిచేస్తున్నాడు అప్పటికి రెండుగంటల నుంచీ పనిచేస్తూవుండటంచేత, ఫిరంగీ అతనూ కూడా బాగా వేడెక్కిపోయి వున్నారు

రెండు మడత వంతెనలలోనూ, ఒకటి కూలిపోయింది. డిఫార్జ్ గర్జించుతున్నాడు. 'కామ్రేడ్స్—విజృంభించండి!'—

ఆ కేకను అందిపుచ్చుకుని మాడమ్ డిఫార్జ్ మహిళాదళాలను ఉద్దేశించి కేక బెట్టింది 'సోదరీమణులారా! హననకాండలో మనం మాత్రం మగవాళ్ళకు తీసిపోతామా! దుర్గం వశం కాగానే మనకూ పని తగులుతుంది సిద్ధంకండి!'

ఫిరంగి కాల్పులు, తుపాకి గుండ్లు, అగ్నిజ్వాలలు, పొగలు, సెగలు!—ఇంకా ఒక అఖాతం—ఒక మడతవంతెన—అభేద్యమైన దుర్గం అలాగే నిలచివుంది కోటబురుజులనుంచి మృత్యువు వర్షించుతోంది. కోటను చుట్టేసిన ప్రజాసముద్రంలో సుడిగుండాలు—సుడిపాలుబడి జనం చస్తున్నారు. కాగడాలు మండుతున్నయ్—కత్తులు మెరుస్తున్నయ్! 'బారికేడ్సు'గా వేసిన తడిగడ్డిమేటాములు పొగలు గమ్ముతున్నయ్. నలుముఖాలా హాహాకారాలు, వీరాలాపాలు, బీభత్సనినాదాలు!—ఇంకా దుర్గం చెక్కుచెదరలేదు నాలుగు గంటల బీభత్ససంగ్రామం; డిఫార్జ్ యింకా ఫిరంగి గొట్టంలో మందు దట్టించుతూనే వున్నాడు.

బురుజులమీదినుంచి పిరంగికాల్పులు హఠాత్తుగా ఆగిపోయినై. కోటలోనుంచి తెల్లజెండా కనుపిస్తోంది. బాస్టిలీ దుర్గం పతనమైపోయింది; దుర్గపాలకులు లొంగిపోయారు!

విప్లవసైన్యం ఒక్క ఉదుటున ముందుకు ప్రవహించింది. ఆ తోపిడీలో ఫిరంగిదగ్గిర వున్న డిఫార్జ్ మడతవంతెనమీదుగా కోట సింహద్వారంలో వచ్చిపడ్డాడు. కొంచెం ఊపిరి పీల్చుకుని తలపైకెత్తి చూచాడు. జాక్విస్ నెం. 3 అతని ప్రక్కనే నిల్చునున్నాడు. మాడం డిఫార్జ్ దూరాన కనుపించుతోంది. ఆవిడ చేతిలోవున్న కత్తి, కూసం విడిచిన త్రాచులా తళతళా మెరుస్తోంది. ఎక్కడబడితే అక్కడ గల్లంతు, పెడబొబ్బలు!

'ఖైదీలు!—జాపితాలు!—చీకటికొట్లు—రహస్యబిలాలు!—పదండి ముందుకు—ఖైదీలు!'—అనేక రకాల కేకలు. ఈ కేకలన్నిటిలోనూ "ఖైదీలు!" అన్న కేక ప్రతినోటివెంటా వెలువడుతోంది జనం లోపలికి జొరబడిపోయారు జైలుఅధికారుల నందర్నీ పీకలు బట్టుకున్నారు. ఏఖైదీ యెక్కడున్నదీ చెప్పకపోతే ప్రాణాలు తీసేస్తామంటున్నారు. డిఫార్జ్ వాళ్ళల్లో ఒకణ్ని గొంతుపట్టుకున్నాడు. వాణ్ణి బడబడా అవతలికి యీడ్చుకుపోయి ఒక గోడమూల నిలవేసి డొక్కలో కుమ్మాడు!

'చెప్పు!—నార్త్‌టవర్ ఎక్కడ?—ఊ! త్వరగా!'—

'చచ్చాను—చూపిస్తా బాబోయ్!—అందులో ఇప్పుడెవ్వరూ లేరు తండ్రోయ్!'—

'నూటఅయిదూ, నార్త్‌టవర్ అంటే అర్థమేవిటి?'—అది ఖైదీ నెంబరా, కొటు నెంబరా—ఏవిటి?—ఊఁ పలుకు!'—

'నరుకు బద్మాష్‌ను!' జాక్విస్ నెం. 3 గర్జించాడు.

'అది గది నెంబరే. బాబోయ్!'—

'సరేపా!—చూపించు!'

ఆ జైలువార్డరును వెంటనే హతమార్చకుండా, డిఫార్జ్ అలా మెడబట్టుకు యీడ్చుకుపోవటం చూసి, జాక్విస్ నెం 3 కు చాలా ఆశాభంగం కలిగింది. అతని రక్తదాహం కొంత చల్లారుతుందని ఆసించాడు. కాని లాభంలేకపోయింది. ముగ్గురూ కలిసి మెట్లెక్కి పైకిపోతున్నారు. జైలు వార్డరు చేతిలో పెద్ద తాళం చెవులగుత్తి వ్రేలాడుతోంది. వాళ్ళ ముగ్గురి తలకాయలూ ఒకదానికొకటి అంత దగ్గరగావున్నా, ఒకరిమాట ఒకరికి వినిపించటంలేదు. లోపలికి చొచ్చుకు వస్తున్న విప్లవకారుల అరుపులకు, మెట్లూ, గోడలూ, తనాబీలూ, గోపురాలూ ప్రతిధ్వనించి పోతున్నయ్.

ఎన్నడూ సూర్యరశ్మి ముఖం యెరగని చీకటి సొరంగాలు, అంధకారబిలాలు, పంజరాలు, గుహలు పాతాళబిలాలు, చీకట్లో తడుముకుంటూ, ఒకరిచేతులు ఒకరు పట్టుకుని ముగ్గురూ నడుస్తున్నారు. ఒకొక్క మలుపుదిరిగే చోటల్లా ఒకొక్క తుగిడీ జనప్రవాహం వాళ్ళని అధిగమించి ముందుకు వెళ్లిపోతోంది. ఇలా కొంతదూరం వెళ్ళి తిరుగుడు మెట్లమీదినుంచి ఒక బురుజుమీదికి ఎక్కుతున్నారు ఆ మెట్లమీద కన్ను పొడుచుకున్నా కనుపించకుండా అంధకార బంధురంగా వుంది. మెట్లప్రక్కను నిట్టనిలువుగా వున్న రాతిగోడలో ఎక్కడా పరంజా కన్నాలు కూడా లేవు ఏదో దిగుడుభావిలో వున్నట్టుంది. చుట్టూ దుర్గంయావత్తూ విప్లవకారుల కోలాహలంతో తుపానురేగిపోతున్నా, ఆ సవ్వడి ఆ తిరుగుడు మెట్లమీదికి, ఎక్కడో ఎంతో దూరంలో కాకులు అరుస్తున్నట్టనిపిస్తోంది.

వార్డరు, తలకుతాకేలా వున్న ఒక చిన్ని దరవాజా దగ్గిర ఆగాడు; తుప్పుబట్టి, కిరకిరారావం చేస్తూ, [illegible] తిరిగి

అనువాదం: తెన్నేటి సూరి

మొరాయించుతున్న తాళంలోకి, తాళంచెవి పోనిచ్చి బలంకొద్దీ తిప్పాడు.

'నూట అయిదూ—నార్త్ టవర్' అంటూ, నెమ్మదిగా తలుపు వెనక్కు నెట్టాడు. ముగ్గురూ తలలు వంచుకుని లోపలికి నడిచారు.

ఆ గదికి, ఎక్కడో గోడకుపైభాగంలో ఒకే ఒక చిన్ని కిటికీ వుంది; దానికికూడా గాలీ వెలుతురూ ఎక్కువ లోపలికి చొచ్చుకు రావటానికి దగ్గరదగ్గరగా ఇనపచువ్వలు అమర్చివున్నయ్. ఆగదిలో ఒక మూలగా కొయ్యలు కాల్చిన బూడిదతో ఒకచిన్ని పొయ్యి వుంది. మరోమూల ఒక బెంచీవుంది. గదికి మధ్యగా ఒక గడ్డి పరుపు పారేసివుంది; చుట్టూ నాలుగు గోడలూ పొగబారి నల్లబడి జీనూతొల్లా వున్నయ్. వాటిలో ఒకగోడ మధ్య తుప్పుబట్టిన ఒక పెద్ద ఇనపకడియం వ్రేలాడుతోంది.

'ఆ చేతిలోవున్న కాగడా ఇలా గోడవేపుగా తీసుకురా' అన్నాడు డిఫార్జ్.

వార్డర్ ఒణుక్కుంటూ చేతులోవున్న కాగడా గోడ పక్కగా చూపించాడు. డిఫార్జ్ గోడపొడుగునా జాగ్రత్తగా పరిశీలించుతున్నాడు.

'ఆగండి—ఇదేవిటో చూడు జాక్విస్!'—

"ఏ. యం." అని జాక్విస్ గోడమీదవున్న అక్షరాలు చదివాడు.

'అలెగ్జాండర్ మానెట్'—డిఫార్జ్ జాక్విస్ చెవిలో మెల్లగా వూదాడు. ఆ అక్షరాల దగ్గిరనుంచి తుపాకిమందుతో నల్లబడి పోయిన చూపుడు వ్రేలు మరికొంచెం ముందుకు పోనిచ్చి: 'ఇదిగో! ఇక్కడ "డాక్టర్" అని వ్రాసివుంది—ఇదిగో ఈ రాతిమీద కాలెండరు గీసుకున్నదికూడా బహుశా ఆయనే అయివుంటాడు. నీ చేతిలో యేవిటది?—తవుగోలేనా?—ఇలా తే'

జాక్విస్ చేతిలోనుంచి తవుగోల తీసుకుని అక్కడున్న బెంచీని కచ్చకొద్దీ నాలుగుపోట్లు పొడిచాడు.

అరేయ్! కాగడా యింకా కొంచెం పైకెత్తు—యీ కత్తి తీసుకుని ఆ గడ్డిపరుపు చీరండి—లోపల గడ్డిలో యేవన్నా వుందేమో వెతకండి!—కాగడా పైకెత్తమన లేదురా!'—

వార్డర్ వంక ఒక్క ఉరుమురిమి, పొయ్యిగడ్డలమీదికి ఎక్కి, తలపైకెత్తి పొగగూడు వైపు పరకాయించిచూచాడు. ఆ పొగగూడుకు పక్కగా తవగోలతో ఒక పోటు పొడిచాడు: ఇన్ని ఇటుకపెల్లలూ దుమ్మూ, మసి, గభాల్న రాలి క్రిందనున్న పొయిలో బడ్డయ్. అవి మొహంమీద పడకుండా తల పక్కకు తిప్పేసుకున్నాడు. ఆ మసికుప్పను ఇటూ అటూ తవుగోలతో కెలికి వెతికిచూచాడు. ఏవీఁ కనుపించలేదు.

'ఈ చెత్తలోనూ—కట్టెలమసిలోనూకూడా యేవీఁ వున్నట్టు లేదు జాక్విస్!'—

'ఏవీఁ లేదు'—

'సరే వాటినన్నిటినీ గదిమధ్య పోగేసి, కాగడా అంటించండి!'

గదిలో చెత్తగుట్టమంటలు లేసుతోంది. దరవాజా తలుపు తాకకుండా వంగి గదిలోనుంచి బయటికి వచ్చేశారు. వాళ్లు ఆ అహోబలబిలపు కక్ష్యాంతరాలన్నీ దాటి యివతలికి పడ్డారు.

కోట సింహద్వారంముందు జనం గగ్గోలుగా అరుస్తూ, తమ నాయకుడైన సారా దుకాణం యజమాని డిఫార్జ్‌కోసం వెతుకుతున్నారు. ఆ దుర్గరక్షకుడుగావుండి, జనంమీద ఫిరంగీలు కాల్పించిన గవర్నర్ను పట్టుకున్నారు. అతణ్ణి విచారణ నిమిత్తం 'హోటల్ డావిల్లా'కు తీసుకుపోవలసిన దశానికి డిఫార్జ్ నాయకత్వం వహిస్తేగాని కుదరదు. డిఫార్జ్‌ని చూడగానే, మాడమ్ డిఫార్జ్ కేక పెట్టింది: 'అడుగో! మా ఆయన!'

ఆ జనంమధ్య, గవర్నరు, మతిచెడి మొద్దుబారిపోయిన మొహంతో, అదో విచిత్రమైన బొమ్మలా వున్నాడు. ఊదారంగు అధికారదుస్తులమీద ఎర్రటి గౌరవచిహ్నాలు ఇంకా అలాగే వున్నయ్. అతని ప్రక్కనే మాడమ్ డిఫార్జ్ పటాకత్తి చేత్తో బుచ్చుకుని మరొక ఉక్కుబొమ్మలా నడుస్తోంది.

గవర్నర్ను వీధివెంట తన్నుకుంటూ తీసుకుపోతున్నారు. హోటలు చేరువకు రాగానే తన్నులు కత్తిపోట్లుగా మారినై. గవర్నర్ హోటలు మెట్లమీద కుదబడిపోయాడు. ప్రక్కనే నడుస్తున్న మాడమ్ డిఫార్జ్ ఆపద్దవాడి గుండెలమీద చెప్పకాలు వేసి అదిమి తొక్కింది. చేతిలోవున్న పటాకత్తితో చివాల్న వాడి తల నరికేసింది.

సెయింట్ ఆంటోనీ వీధిలో వీధి దీపాలకుమారు, మనుషుల శవాలు తీగలమీద వ్రేలాడే బీభత్స తరుణం ఆసన్నమైంది. సెయింట్ ఆంటోనీ రక్తం ఉడుకెత్తిపోయింది. అంతవరదాకా, ఉక్కు పాదాలక్రింది ప్రజల్ని నలిపివేస్తూ గంగ శివాలాడిన నిరంకుశత్వం హోటలుమెట్లమీద కుదబడి కూలిపోయింది. దానిగుండెలమీద మాడమ్ డిఫార్జ్ చెప్పకాలు తొండవమాడుతోంది.

'అరేయ్! ఆ వీధిదీపం లాగెయ్యండిరా'—సెయింట్ ఆంటోనీ గర్జించాడు. దీపానికి మారుగా గవర్నర్ మొండెం తీగమధ్య వ్రేలాడుతోంది.

అంతూ పంతూ లేని ఆవిలయసముద్రం, భయంకరంగా ముందుకు పాక్తిపోతోంది. ఆ సముద్రంమధ్యను, అప్పుడే హఠాత్తుగా జైలునుంచి విడుదలచేయబడి, ఏది యేవిఁటైందీ తెలియక విభ్రాంతిపడి చూస్తున్న ఒక యేడు ముఖాలు మనుషుల బుజాలమీద, మొండిగోడలమీద కొండముచ్చులులా యికిలిస్తూ ఎత్తుగా కూర్చుని, ఆ జనం పెడుతున్న వెర్రికేకలు వింటున్నయ్. మరోచోట, రక్తాలోడుతున్న మరో యేడు తలకాయలు ఈటెలచివరలకు గుచ్చి ఆకాశంలోకి యెత్తివున్నయ్.

1789 సంవత్సరం జూలైనెల మధ్యలో ఒక రోజున ఈ విలయోత్సవం పారిస్ నడివీధులగుండా ప్రవహించుతోంది.

## 31

పానశాలలో యోధానుయోధులంతా కిటకిటలాడుతున్నారు. ఒకరినొకరు మహోల్లాసంగా కౌగిలించుకు వీరాలాపాలలో మునిగితేలుతున్నారు. మాడమ్ డిఫార్జ్ మామూలుప్రకారం, అమ్మకం బల్లదగ్గిర కూర్చుని, ఆ సభకు అధ్యక్షత వహించివుంది. ఆవేళ ఆ వీరనారీమణి తలలో రక్తగులాబీ కనుపించటంలేదు. దాని అవసరం తీరిపోయింది. గూఢచారులంతా ఈ వారంరోజుల తాకిడీతోనే హడలిపోయి, సెయింట్ ఆంటోనీపాదాలముందు దాసోహమై ఆ సౌభ్రాతృత్వంలో చేరిపోయారు.

మాడమ్ డిఫార్జ్ కుర్చీలో యాలిగిలబడి కూర్చుని, పానశాలలోవున్న జనాన్నీ, వీధిలో కలుపించుతున్న జనాన్నీ చూస్తోంది. వీధిలోనూ, లోపలకూడా జనం గుంపులు గుంపులుగా నిల్చుని కబుర్లాడుకుంటున్నారు. చింపిరి జుట్లూ, చిరిగిపోయిన చొక్కాలూ, వాళ్లంతా, దరిద్రనారాయణావతారాలుగా వున్నా, వాళ్ళలో ఇప్పుడు అదో అధికారధీమా కనుపించుతోంది ఆ విషయాని

అర్థం చేసుకుని మాడమ్ డిఫార్జ్ లోలోపల ఆనందపడుతోంది. ఆవిడ ప్రక్కనే మరో లావుపాటి పొట్టికురచ మహిళారత్నం నిల్చునుంది; పొట్ట జరక్క ఆకలికి నకనకలాడుతుండే ఒక చిల్లర దుకాణంవాడి భార్య; ఒక యిద్దరు బిడ్డల తల్లి; ఆ వీరనారి, బాస్టిల్ రణక్షేత్రంలోనే, తన వీరకృత్యాలకు ప్రతిఫలంగా 'ప్రతీకారిణి' అనే గౌరవ బిరుదాన్ని సంపాదించుకుంది.

'ఆఁ!—ఏవిటా గల్లంతూ!—ఎవరా వచ్చిందీ!' అన్నది ప్రతీకారిణి.

సెయింట్ ఆంటోనీవీధి మొగిలోనుంచి పానశాల మెట్ల దగ్గిరికి యేదో మందుగని సురసురా కాలుకుంటూ వస్తున్నట్టు, వీధిపొడుగునా యేదో గుజగుజ రేగింది.

'అడుగో! అయనే వస్తున్నాడు!'—అన్నది మాడమ్. డిఫార్జ్ రొజుకుంటూ లోపలికి పరుగెత్తుకొచ్చాడు: అతన్ని చూడగానే అక్కడున్న జనం యావత్తూ చుట్టూ చుట్టేశారు.

"సోదరసోదరీమణులారా!' అన్నాడు.

'సైలెన్స్—వినండి వినండి' అని కేక బెట్టింది మాడమ్ డిఫార్జ్, ఆవేశంగా లేచి నిల్చుని:

'సోదరులారా! ఆకలితో అల్లాడుతున్న మన బీదప్రజల్ని గడ్డితిని బ్రతకమని కూసిన ఆ పరమనీచుడు, ప్రజాద్రోహి అయిన ఫౌలన్ అనే కిరాతుడు మీకు తెలుసు!'

'చచ్చాడుగా'—

'చావలేదు—అంతా వట్టిది. చచ్చిపోయినట్టు స్వయంగా పుకారు వేయించి, అంత్యక్రియల నటనకూడా జరిపించాడు!'

'ఏవిటీ!—అరి బద్మాష్!'—

'ఆ పరమనీచుడు ఇప్పుడు మనచేతికి చిక్కాడు—హోటల్ డా విల్లాలో ఖైదీగా వుంచాం. సోదరులారా బయలుదేరండి, పగదీర్చుకోండి!—'

ప్రతీకారిణి దబదబా ఢంకా మోగించింది. బల్లమీద పటాకత్తి చివాల్న అందిపుచ్చుకుని మాడమ్‌డిఫార్జ్ 'హూయ్!' అంటూ పెద్దపెట్టున ఒక వెర్రికేక బెట్టి బయలుదేరింది. వీరావేశంతో ఊగిపోతున్న ఆజనప్రవాహం వీధివెంట సెలయేళ్ళ ముంపులా ప్రవహిస్తోంది. అందినవాడు అందిన ఆయుధం చేతబట్టి ఇళ్ళల్లోనుంచి బయటికి పరుగెత్తుకొచ్చి ప్రవాహంలో కలిసి కొట్టుకుపోతున్నారు. పాలుదాగని పసిగుడ్లనూ, తిండి తినని ముసలివాళ్లను మంచాలలో వదిలేసి ఎలావున్నవాళ్ళు అలా నిలుచున్న పళంగా బయటికి వచ్చేస్తున్నారు.

'నీచుడు!—కిరాతుడు! పంద! పశువు!—పదుకో బెట్టి చీల్చండి! ఫౌలన్ కిరాతుణ్ణి కడి కండలు రాల్చండి!'—

ఆ పెడబొబ్బలతో ఆకాశం ప్రతిధ్వనించిపోతోంది. 'గడ్డి తినమని కూశాడు—బిడ్డకు పాలులేవండీ అంటే!—రొమ్ముల్లో పాలెండిపోతే—రొంపిగడ్డి చీకబెట్టమని తిట్టాడు నా పసి తండ్రిని—బిడ్డ చచ్చిపోతుంటే యేవీఁ చెయ్యలేక యేడ్చాను—ఈవేళ ఆఫౌలన్‌గాడి రక్తంతాగి నాకడుపుమంట తీర్చుకుంటాను' అని కచ్చగా అంటోంది ఒక యిల్లాలు.

ఫౌలన్ను కట్టేసివుంచిన హోటలుహాలు ఇసక వేస్తే రాలకుండా కిటకిటలాడిపోయింది. హాలే కాదు; చుట్టూవున్న ఆవరణ, రోడ్డు యావత్తూ తొలగదొయ్యటానికి సందులేదు.

డిఫార్జ్‌దంపతులూ, ప్రతీకారిణి, జాక్వెస్–3, ముందు పీఠిని కనుపించుతున్నారు. మాడమ్‌డిఫార్జ్ కత్తిమొనతో ఫౌలన్‌వంక చూపిస్తూ!

'అడుగో కిరాతుడు! జనాన్ని గడ్డితిని బ్రతకమన్న పరమ లుచ్చా!—వాడినోట్లో యింత గడ్డి కూరండి!—తినమనండిప్పుడు!—హాఁ! హాఁ! బాగుంది! బలేపని చేశారు!' చేతిలోవున్న కత్తి చంకలో బెట్టుకుని ఉల్లాసంగా చప్పట్లు చరిచింది. ఆ చప్పట్లు అందిపుచ్చుకుని, చుట్టూ హాల్లోవున్న వాళ్ళే కాకుండా దొడ్లూ, దోవలూ, గోడలూ గొపికెలూ, గుమ్మాలూ వీధులూ యావత్తూ ప్రతిధ్వనించిపోయినై. ఒకొక్కవరస ఈడుతూవుండటం, ఒకొక్కవరస చప్పట్లు చరుస్తూవుండటం, ఆ వరసని రెండు మూడు గంటలసేపు ఆనందకోలాహలం సాగిపోయింది.

ఉన్నట్టుండి డిఫార్జ్ సింహంలా ముంచుకురికి ఫౌలన్ను మెడబట్టుకున్నాడు. మాడమ్ డిఫార్జ్ కూడా ముందుకుదూకి ఫౌలన్ను కట్టివేసిన త్రాడును పలుపులా లాగి పట్టుకుంది. ప్రతీకారిణీ, జాక్వెస్ యింకా దూరంగానే వున్నారు. ఇంతలోనే జనంలోనుంచి వీరావేశంగా బీభత్సనినాదం వినిపించింది:

'పడలాక్కురండి బయటికి!'

క్రిందామీదా, ఈడుస్తూ, పడలాగుతూ, తన్నుతూ గుద్దుతూ, వీధి మొగిలోకి చచ్చిన బర్రెదూడను యీడ్చుకువచ్చినట్టు పడలాక్కొచ్చారు; రోడ్డుమీద యీడ్చుకు వస్తుంటే, ఫౌలన్ ఒళ్లంతా కొట్టుకుపోయి రాక్తాలోడిపోతోంది. మరణవేదనలో యేడుస్తున్న అతని ఆక్రందనం అక్కడ యెవ్వరి చెవులకు వినిపించటం లేదు. వీధిమొగిలోకి వచ్చిన తరవాత, పిల్లి యెలుకను విదిలించి పారేసినట్టు, మాడమ్ డిఫార్జ్ ఫౌలన్ను ఒక్క విదిలింపు విదిలించి నేలబారేసింది. నలుగురూ మీదబడి అతని నోటినిండా చెత్తకూరి, మెడకు తాడుతగిలించి వీధిదీపానికి మారుగా తీగమధ్య వ్రేలాడదీశారు. తాడుతెగి రోడ్డుమీదపడి చితాచితలైనాడు. మళ్లీ యెత్తి మళ్లా వ్రేలాడదీశారు. ఈతూరి ఆతాడు కొస్త దయదలచి మళ్ళా తెగిపోలేదు. మరుక్షణంలో అతని తలను బరిసెకు గుచ్చుకుని, ఆ జనమంతా దానిచుట్టూ తిరుగుతూ ఆనందనృత్యం చేశారు.

ఆనాటి అకృత్యాలు అంతటితో ఆగలేదు. సెయింట్ ఆంటోనీ రక్తనాడులన్నీ ఆవేళ తారాపథానికి ఉడుకెత్తిపోయి వున్నయ్. చచ్చిన ఫౌలన్ అల్లుడు మరో ప్రజావిరోధి పారిస్‌కు వచ్చినట్టు తెలిసింది. పోయిపడ్డారు. ముక్కలు ముక్కలుగా నరికారు. అతని తలకూడా మామ తలతోపాటు ఈటెకు గుచ్చుకుని ఈరుళ్ళకొలుపుగా ఉత్సవం చేశారు.

ఈ ఆడవాళ్లూ, మగవాళ్లూ యిళ్లకు తిరిగివచ్చేసరికి, రాత్రి బాగా పొద్దుబోయింది. కూడూకుమ్మాలేని పసిబిడ్డలు కుయ్యో మొర్రో అని యిళ్లల్లోబడి యేడుస్తున్నారు. వాళ్లకి లోలోపల ఆకలి దహించుకుపోతూనే వుంది. కాని ఆనాడు జరిపిన వీరకృత్యాల సర్దాలో ఆకలి దప్పులు ఒక లెక్కగా కనుపించటం లేదు. ఏదో యింటోవున్నది కాస్తాకూస్తా నంజి సర్దాగా కబుర్లాడుకుంటున్నారు. తండ్రులూ, తల్లులూ నకనకలాడుతున్న బిడ్డల్ని ఆవేశంగా ముద్దులాడుతున్నారు. ప్రేమీ ప్రేమికులైన యువతీ యువకులు భవిష్యత్తును గురించి కలలుగంటూ ఆనందంగా నిద్రపోతున్నారు.

ఆరాత్రి తెల్లవార్లూ డిఫార్జ్ పానశాల, దేవేంద్ర సభలా కిటకిటలాడుతూనే వుంది. వున్నవాళ్లంతా సాంతం బయటికి వెళ్లిపోయేసరికి, కాకులు కూసి తెలతెలవార వస్తోంది.

పానశాల గేటు తాళంవేస్తూ డిఫార్జ్ భార్యవంక చూసి:

'అమ్మయ్యా! ఇప్పటికి వచ్చింది శుభదినం' అన్నాడు.

'ఆ ఇంచుమించు వచ్చేసినట్టే' అన్నది భార్య. 

# ఉపక్రమణిక

[లండన్ హైడ్ పార్కులో. ఒక నాటి రాత్రి. ఇనుపకంచెలు, బెంచీలూ, చెట్లూ, పొదలూ కనుచీకటిలో మాచాయగా కనపడుతుంటాయి. ఒక యువతి ఒంటరిగా కూర్చుని ఉంటుంది. గుడ్డివెలుగు కొద్దికొద్దిగా ఆమెపైన పడుతుంది. బెరుకు బెరుగ్గా అటూ ఇటూ చూస్తూఉంటుంది ముఫ్తీలో ఒక పోలీసు కొద్దిదూరంలో పచారుచేస్తూ ఆమె నొక కంట కనిపెడుతూ ఉంటాడు. పోలీసుల్ని చూసి పార్కుల్లో కంగారుపడే యువతు లెవరో వేరే చెప్ప నవసరంలేదు. వాళ్ళు వ్యభిచారంవల్ల జీవనోపాధి గడుపుకుంటున్న వాళ్ళన్నమాట. పోలీసు ఇది గ్రహించే కాపలా వేశాడు. ఇద్దరు పురు



# పరాజ

(నాటిక)

జాన్ గాల్స్‌వర్దీ

షులు ఆ దారిని వెడతారు కాని ఆమె వంక తలెత్తయినా చూడరు కొంతసేపు మరెవ్వరూ కనపడరు తరవాత ఒక యువకుడు, డెనాంట్, మెల్లిగా చేతులూపుకుంటూ అటు వస్తాడు. పొడగరి, బలిష్ఠుడు. కొద్దిగా సమీపించగానే యువతి హఠాత్తుగా తలెత్తి, అతిమెల్లిగా అంటుంది "నమస్కారం". యువకుడు ఆగిపోతాడు. గుడ్డి వెలుగులో ఆమె వంక కళ్లు పొడుచ్చుకు చూస్తాడు. "నమస్కారం" అంటూనే ముందుకి అడుగు వేస్తాడు యువతి మళ్ళీ పలకరిస్తుంది ]

యువతి · (మెల్లిగా) అగ్గిపెట్టుందా ? [సిగరెట్టు తీస్తుంది. యువకుడు అగ్గిపుల్ల వెలిగించి అంటిస్తాడు]

యువతి కావాలా? [తన సిగరెట్టు అందివ్వబోతుంది ]

డెనాంట్ . అక్కర్లేదు చేతిలో ఒకటి వెలుగుతోంది. (బెంచీమీద కాలు మోపి నిలబడతాడు.)

యువతి : గుర్రప్పందేలకి వెళ్తోస్తున్నారా?

డెనాంట్ : అవును

యువతి · నేనూ వెళ్లాను కిందటి తడవ

డెనాంట్'. పందెం దేనిమీద కాశారు?

యువతి వెనకపడ్డ ప్రతి గుర్రం మీదానూ ఛీ! ఈ గుర్రాల్ని నమ్మకూడదు

డెనాంట్ : గుర్రాలంటే ఇష్టంలేదల్లే వుంది మీకు.

యువతి · ఇష్టంలేకేం! చూడ్డానికి అందంగానే ఉంటాయి

డెనాంట్ : నిజం. ముద్దొస్తాయి నాకు

యువతి · ఆడవాళ్లమాదిరా ?

డెనాంట్ : (కొంటె నవ్వు) నువ్వు, తప్పు.

యువతి : అంటే ?

డెనాంట్ : అంత చక్కగా మెడచాచే ఆడవాళ్ళు అట్టే కనపడరులే.

యువతి : ఆడవాళ్ళంటే గిట్టదనుకుంటా నీకు తెలుస్తోనే వుంది.

డెనాంట్ : అది కొంత నిజమే.

యువతి మనసులో మాటదాచకుండా చెప్పావు అదీ నయమే.

డెనాంట్ : నిజం అడిగితే చెప్తాను: గుర్రాలకన్ని దుర్గుణాల్లేవు

యువతి . మరి ఆడవాళ్ళకా? ఆ దుర్గుణాలెవరివల అబ్బుతాయంటావ్ ?

డె . తెలుసులే, తప్పంతా మొగాళ్లదే నంటారు. కాని మనసువిప్పి నిజం చెప్ప

యు (నవ్వుతుంది) ఏమో! గుర్రాలకీ దుర్గుణాలు నేర్పగలరు మొగాళ్లు.

డె : అరె! నిజమేసుమా! (ఆమెపక్క కూచుంటాడు) అయినా పడమట చూశాను, అక్కడ గుర్రాలు మరీ బరితెగించి తిరుగుతాయి.

యు అబ్బే! ఆడవాళ్ళకంటె తెగించలేవవ్వి

[ఇద్దరూ క్షణంసేపు ఒకరివంక ఒకరు తేరిపార చూసుకుంటారు ]

డె : పాపం గుర్రాల్ని ఏమనకూడదు. భూమ్మీద మనిషి పుట్టగానే గుర్రాన్ని లొంగదీసుకున్నాడు

యు : మనిషి పుట్టినప్పుడు ప్రపంచం ఎలా వుండేదో! ఈ పార్కులాగే ఉండేది కాబోలు అప్పుడూ ఒక పోలీసు ఉన్నాడు—దేవుడు

డెనాంట్ : పార్కుకి రోజూవస్తావా ?

యు ఇంకెక్కడికి పోగలం ? గస్తీ మహా జోరుగా ఉంటోంది.

డె పాపం ఎప్పుడూ మీ వెంట నీడల్లా తిరుగుతారు.

యు . సిపాయివా నువ్వు ?

డె : ఒకప్పుడు.

యు : ఇప్పుడు ?

డె ఫాదిరీ అవాలనుంది.

యు ఓ! (నవ్వుతుంది) ఏదో డబ్బున్నట్టుంది

అనువాదం :

**సూరంపూడి సీతారామ్**

డె : ఏదో కొద్దిగా.

యు : (నిట్టూరుస్తుంది) నాకే డబ్బుంటేనా! ఏంచేస్తానో తెలుసా ?

డె : క్షణంలో కడిగేస్తావు.

యు : అదే చెయ్యను. డబ్బుకోసం మీ మొగాళ్ళని నమ్ముకోడంకంటె నీచం లేదు.

డె : నీవంటిదే అవిడెవరో ఇలాగే అందట మొదట.

యు : తరవాతేమందేం ?

డె : ఏమంటుంది ? 'నాకీ డబ్బువద్దు స్వేచ్ఛావద్దు, మొర్రో మొగాడు కావాలి' అని మొత్తుకుంది

యు . పొరపాటుపడింది అబ్బే! నేనైతే ఛస్తే మొగాణ్ణి మళ్ళీ దగ్గిర చేరనిచ్చేదాన్ని కాదు. కాని, డబ్బు కూడబెట్టుకోడమే చేతకాదు అక్కడే వస్తోంది తంటా. ఇప్పుడు రోజులు మరీపాడుగా ఉన్నాయంటున్నారే

డె ఎవరు ? మామూలు ఆడవాళ్లా ?

యు : మామూలు ఆడవాళ్ళంటే ?

డె · అంటే — నువ్వు మామూలు ఆడదానివి కాదుగా ? అంతేనా ?

[యువతి నోరుమూతపడిపోతుంది]

డె అబ్బెబ్బే! నీకు నొప్పి కలిగించాలనుకోలేదు

యు . అనుకున్నావా డి వగుంటావే అసలు! అనుకున్నా ఇంత నొప్పి కలిగించలేవు నువ్వు చెప్పిందీ నిజమేలే (మాటల్లో బాధ వ్యక్తమౌతుంది) తప్పులు కమ్ముకోడానికి మాకు మాత్రం ఏముం దిప్పుడు ?

డె · చలాకీ మాయమైందే అప్పుడే!

యు ఓ! చలాకీపిల్ల కావాలేం ? మొగాళ్లు ఇట్టే ప్లేటు ఫిరాయించగలరులే. అయినా, చెరలాటం కోరివచ్చిన ఎలక్కి భయమెందుకు ? వచ్చి దగ్గిర కూచుని పలకరించావు. అదే చాలు (చల్లగా అతని చేతిలో చెయ్యికలిపి కార్డు అందిస్తుంది— తన ఇంటి కీరునామా ఉన్న కార్డు.) ఇదిగో ఈ ఇంటికివస్తూ ఉండు

డె (కంగారు పడతాడు. కార్డునందుకుంటాడు) ఓ! అల్లాగే.

యు : అంటే ?

డె అంటే — తోచినప్పుడొస్తాను.

యు : ఇప్పుడో ?

డె · ఇంకోచోటికి వెళ్లాలి

యు · ఏం — ఇంకో అమ్మాయుందా ?

డె ఊహుం.

యు నేనంటే ఇష్టంలేదా ?

డె · ఇష్టానికేముంది ? నీది అదోదారి.

యు : తప్పుదారి కాదూ ?

డె . ఓక్! ఇంతకంటె తప్పు తెలుగుదుం.

యు . ఇది కూడా ఖుంకోసమేం

కాదు, పొట్టకోసం. ఇంతకంటె నికృష్టపు బతుకింకోటి లేదు.

డె : ఇందులో కెల్లా జారిపడ్డావ్ ?

యు : అక్కడికొస్తు. అందరూ ఇల్లాగే అడుగుతారు. దానికి చెప్పే జవాబు లెన్నడూ నిజం కావు. ప్రపంచంలో మావృత్తే మొట్టమొదటిది. అసలదీ కాదు. ఇంకోటి ఉంది.

డె : నిజం?

యు : పోలీసు వృత్తి, వాళ్ళవల్ల కాక పోతే మాకసలీ చాటువృత్తే అవసరం లేదుగా.

డె : ఇంకా నయం.

యు : నయంలేదు, గియంలేదు. పిట్టల్ని కొట్టేచోటు కెప్పుడేనా వెళ్లావా ? అలాగే వుంటుంది మా బతుకు.

డె : కోర్టు చిక్కావా ఎప్పుడేనా ?

యు : ఇంకా లేదులే (హఠాత్తుగా ఆవేశంతో) మేంమాత్రం ఏం చెయ్యం ? మేం కన్నుగీటితే కాని మే మెవరో ఎవరికి మాత్రం ఎలా తెలుస్తుంది.

డె : చూడ్డానికి బలేగా ఉంటుంది

యు : అవును. 'వీధుల్లో ఇలాంటివాళ్ళుండకూడదు తగిలెయ్యండి' అంటారు. అసలు మొగాళ్ళకి తగల్నిస్తే లోకం బాగుపడుతుంది.

డె : అప్పుడు మీ పనేమౌతుంది ?

యు (ఆక్రోశంతో) ఈగతి పట్టదుగా?

డె : (తెల్లబోతాడు) త్వంశుంఠ అంటే త్వంశుంఠ. ఇంతేగా. పోనీ దానికేంగాని ఇంకో సంగతి మాటాడుకుందాం.

యు : పర్షియా పిల్లుల్ని చూశావూ ?

డె బలే అందంగా ఉంటాయి.

యు : నాదగ్గ రొకటుంది. చూడ్డానికి వస్తావా ? ఎప్పుడొస్తావు ?

[డెనాంట్ బుర్ర ఆడిస్తాడు. లేచి నిలబడి చెయ్యి అందిస్తాడు. యువతి కూడా లేచి చెయ్యిఅందుకోబోయి, హఠాత్తుగా వెనకడుగు వేస్తుంది. డెనాంట్ ముందుకి నడుస్తాడు. యువతి అతని కోటు పట్టుకు లాగబోతుంది. చటుక్కున పోలీసువచ్చి ఆమెచెయ్యి పట్టుకుంటాడు. తప్పించుకోడానికి ప్రయత్నిస్తుంది. కాని ఇట్టే చిక్కిపోతుంది.]

యు : (భయంతో) ఎవరు నువ్వు ?

పోలీసు : నేను పోలీసుని.

[యువతి గింజుకుంటుంది. పోలీసు ఆమె చెయ్యి మెలితిప్పుతాడు. నెప్పికి కవ్వు మంటుంది.]

యు : మోటపశువు ! వొదులు.

పో : ఆ ! ఆ ! ఆగాగు. గింజుకోకుండా ఉంటే నెప్పెట్టదు.

యు: నేనేం చేశాను? ఏం చెయ్యండే.



ఒక ఆసామీ తన భార్య కనిపించటం లేదని పోలీసు స్టేషనులో రిపోర్టుచేశాడు. ఇన్స్పెక్టరడిగాడు:

"ఆవిడ ఎల్లా ఉంటుంది?"

"నల్లగా, అయిదడుగుల నాలు గంగుళాల పొడుగూ, 160 పౌనుల బరువూ, ఎత్తు పళ్లూ—"

"నరే. ఎన్నాళ్లయింది కనిపించక?"

"రెండు వారాలు"

"ఇంతకాలం ఎందుకు రిపోర్టుచెయ్యలేదు?"

"ఇదంతా కల అనుకున్నానండి."

పో : అవునవును పాపం.

యు : నేనేం చెయ్యలేదు. కావలిస్తే అతన్నడుగు.

[డెనాంట్ తిరిగివస్తాడు]

యు : చెప్పు. నేన్నిన్ను పిలిచానా ? నీ అంతట నువ్వేవచ్చి మాటాడలేదూ ?

డె : అవును. నువ్వెవరు ?

పోలీసు . (అధికారముద్ర తీసి చూపిస్తాడు). ఈమె నిన్ను పిలిచింది, నేను కనిపెడుతూనే ఉన్నాను.

డె : ఓహో ! గొప్పపని చేశావులే. పప్పులో కాలేశావ్ కాని...

పో : నేను స్వయంగా చూశాను ఈమె నిన్ను పిలవడం. వెళ్ళిపోతోంటే కోటు కూడా పట్టుకులాగింది.

డె: నువ్వేం చూస్తే ఎవడికొ్కాలోయ్. వొదులు ముందీమెని.

పో: (యువతి చెయ్యి విడిచిపెట్టకుండానే, అతనివంక తీక్షణంగాచూస్తూ) ఆశ్లే బొంకకు. నీదారిని నువ్వెళ్ళు.

డె: ఆమెని వొదిలిపెట్టు. ఇది నీ డ్యూటీ కాదు.

పో: నా డ్యూటీ సంగతి నీకేం తెలుసోయ్? ఈ పార్కు్లోకి ఇలాంటి పిట్టలు రాకుండా చూడవలసిన డ్యూటీ నాది. నువ్వు కదుల్తావా లేదా.

డె: కదల్ను. ఇక్కడే ఉంటాను. ఏంచేస్తావ్?

పో: సరే కానీ. రా స్టేషన్‌కి మాతో కూడా.

డె: ఇద్దరు కూచుని మాటాడుకోడానికి లేదా ఇంక? నేనేం నీకు ఫిర్యాదు చెయ్యలేదుగా?

పో: ఈమె ఎవరో నాకు బాగా తెలుసని చెప్తున్నాను. ఇందులో నీ తల దూర్చకు జాగర్త. దూరిస్తే నిన్నుకూడా తీసుకెళ్ళవలసొస్తుంది.

డె: ఆమెని వొదిలేసి, కావలిస్తే నన్ను పట్టుకో.

పో: ఇదిగో ఇలా చూడు. ఊరుకున్నంతసేపే నేను. నన్ను అడ్డగించావా ఇంకో ఇద్దర్ని పిలిచి ఇద్దర్నీ స్టేషన్‌కి తీసుకెడతాను

డె: అనవసరంగా చెడిపోతావు, నా మాట విను. ఈమె నన్ను పిలవలేదు. అసలు నాఅంతట నేను......

పో: నాకు చెప్పకదంతా. ఇంతకుముందు కూడా చూశా నీమె నిక్కడ. తన వృత్తికోసం వస్తుం దిక్కడికి. ఇలాంటి వాళ్ళని పట్టుకోడం నా డ్యూటీ. ఈమెకెలాగూ శిక్ష తప్పదు. ఇది మూడో రాత్రి నేనీమెని చూడ్డం...

యువతి: ఎప్పుడూ నీ మొకూం చూళ్ళేదు నేను.

పో: నిన్ను చూశాలే నేను. అయినా చాలదూరం తమాయించి చూశాను. ఇంక చాలు...(పోలీసు ఈల తీసి నోట్లో పెట్టుకుంటాడు)

డె: ఛీఛీ! సిగ్గు లేధూ. ఆమె చెయ్యి విడిచిపెట్టు. ఊ!

[డెనాంట్ పోలీసు చెయ్యి పట్టుకుంటాడు. పోలీసు ఈల ఊత్తాడు. యువతి చెయ్యి వొదిలి డెనాంట్ చెయ్యి పట్టుకుంటాడు. డెనాంట్, పోలీసు పట్టు వొదుల్చుకుంటాడు.)

డె: (యువతితో) ఊ! పారిపో. పరుగెత్తూ.

యువతి: వొదొను పోలీసుగా డను. వాళ్ళనివొదిలించుకో లేవు మళ్ళీ. నేను స్టేషన్‌కి వెడతాలే

డె: (పోలీసుని దూరంగా నెట్టి నిలబెడుతూ) పరుగెత్తూ. ఊ! నామాటవిను. నే చూస్తాగా వీడిసంగతి.

(పోలీసు హఠాత్తుగా డెనాంట్‌ని వడుము ఒడిసి పట్టుకుంటాడు)

యువతి: అరెరె!

డె: ఫరవాలేదు. నువ్వుపో.

[డెనాంట్ పోలీసు పట్టు విడిపించుకుని గెంటుతాడు. పోలీసు మళ్ళీమీదికి రాబోతాడు]

డె: ఏం కావాలా?

[పోలీసుని దవడమీద గురి చూసి గుప్పిటతో బలంకొద్దీ కొడతాడు. పోలీసు తూలిపడి వెనకఉన్న ఇనపరాటపైన పడ

(25-వ పేజీ చూడండి)

# అదృష్టమా ప్రయత్నమా?

అదృష్టదాసుకు చిన్నప్పటినుండీ గొంతెమ్మ కోరికలు వుండేవి. 'ఏమైనా అనాయాసంగా హఠాత్తుగా లభిస్తే ధన్యుణ్ణి అవుతాన'ని వుద్దేశ్యాలు తలలో మెదలుతూ వుండేవి. ముసలివాళ్ళు చెప్పే అరేబియన్ నైట్సు, తీర్థయాత్రల మజిలీలవంటి కథల్లోన్నుంచి యిట్టి భావాలు ఆరంభించాయి కాబోలు! బొత్తిగా చిన్నప్పుడు ఆటవస్తువులు ఆకాశంనుండి వూడి యెదుటపడితే సరదా తీరుతుందని ఆశ. చదువుకునే రోజుల్లో "ఊరకవచ్చు పాటు పడకుండిననైన ఫలం బదృష్ట మేపారగఁగల్గు వానికిన్" అనే భాస్కర శతకంలోని పద్యం హృదయంలో నిరంతరం స్పందిస్తూ వుండేది. కష్టపడి చదవకుండానే ఫస్టు మార్కు వసే రావచ్చుననీ, తన అదృష్టం బాగా వుంటే ఎగ్జామినరు తన పేపరు దిదుతూవుండే సమయంలో ఆయనగారి భార్య అమాంతంగా అతని చేతిలోనుండి తన అన్సరు పేపరూ కలమూ లాక్కొని నూటికి నూరు మార్కులూ వేసెయ్యవచ్చుననీ ఆశ పడేవాడు. ఇలాంటి ఆశలు పెట్టుకొని, అదృష్టంమీద ఆధారపడి చదువు యెగ్గొట్టి పరీక్షల్లో కొన్నిసార్లు తప్పడం కూడా జరిగింది'

తల్లిదండ్రులకు లేక లేక కలిగిన కుమారుడైనందువల్లా, పేరు పెట్టడం ఆలస్యంచేస్తే చిరంజీవి అవుతాడనే వారి నమ్మకంవల్లా, అతనికి కొన్ని సంవత్సరాలవరకూ ఏ పేరూ లేకపోయింది. కుమారుడు గొప్ప అదృష్టవంతుడు కావాలనే కోర్కెవల్లనూ చిన్నప్పటి ఆటపాటలలో గొంతెమ్మ కోర్కెలు వ్యక్తమవడంవల్లనూ, తల్లిదండ్రులు "అదృష్టదాసు" అనే పేరు కుమారుడికి వుంచారు. పేరుకు తగినట్టు అతడు విద్యార్థిదశ గడిపినాడు.

కొన్నాళ్ళయినపిమ్మట చదువుకు స్వస్తి చెప్పి అదృష్టదాసు వుద్యోగంలో ప్రవేశించినతర్వాత ఒక చిన్నపట్నంలో ఒంటరిగా వుండడం తటస్థించింది. ఆ ప్రాంతాలకు ఒకవేళ యేదైనా సినీమాపార్టీ ఔట్ డోర్ షూటింగుకు వస్తే, హీరోయిన్ తార తనను చూచి వలచి, మహాప్రయత్నంమీద తన బస తెలుసుకొని, తన్ను వివాహం చేసుకోడానికి ఉబలాటపడుతుందనీ, తాను మొదట మురిపించి తర్వాత త్యాగబుద్ధితో ఒప్పుకొని రిజిస్ట్రేషన్ మేరేజీ గప్ చిప్ గా చేసుకోవాలనీ, అప్పటితో ఒక లక్షాధికారిణికి భర్తఅయిపోగలడనీ, ఆ యాస్తి చాకచక్యంగా మేనేజిమెంటు చెయ్యాలనీ అదృష్టదాసు అనుకునేవాడు. కాని అలాంటి సంఘటన యేదీ జరగలేదు.

సరే, తనకు వివాహం చెయ్యాలని తండ్రిగారు సంబంధాలకోసం చూస్తున్నారుకదా, అనమం నెయ్యిన్నూట పదార్లయినా కట్నం దొరక్కపోతుందా అని అదృష్టదాసు అనుకున్నాడు కాని అర్ధనూట పదారుకంటె చిల్లిగవ్వయినా హెచ్చుదొరకకుండానే పెళ్ళిజరిగింది. ఆ రోజుల్లో యిప్పటివలె వరుల ధరలు పెరగలేదు.

వాళ్ళ ఆఫీసు యినస్పెక్షను టైములో సూపరింటెండెంటు గారికి తనమీద అవ్యాజకరుణ ఒక్కసారిగా తటుక్కున జనించి, తనకు ప్రిఫరెన్సు యిచ్చి సీనియర్సును తలదన్నించి ఒక గుఱ్ఱపుదాటు వేయించి, ఆఫీసరు వుద్యోగంలో తన్ను కూర్చోబెడతారని ఉవ్విళ్లూరేవాడు కాని, అందుకు బదులు డ్రెస్సు డీసెంటుగా లేదనీ, మేనర్సు మోటుగా వున్నాయనీ చీవాట్లూ, చివరకు జరిమానా ప్రాప్తించేవి. అదృష్టదాసుకు.

కుటుంబభారం మూలాన్న జీతం చాలక డబ్బుకు రొక్కటం యెక్కువైనకొద్దీ అతనికి కోరికలు యెక్కువయాయి. ఫస్టు ప్రైజుకోసం క్రాసువర్డు పజిల్సు సాల్వు చేస్తూ రాత్రింబగళ్లు కష్టపడేవాడు. నిద్రాభంగమూ, తలనొప్పి, ఎంట్రెన్సు ఫీజు దండుగా అయినాయి. అంతే. లాటరీలలో పావలాది మొదలు పదిపన్నెండు రూపాయిలు విలువగల స్వదేశ, విదేశాల స్వీప్ టిక్కెట్లవరకూ చాలా కొన్నాడు. లక్షలలో—అధమం కొన్ని వేలైనా ప్రైజు క్రింద వస్తుందని కొండంత ఆశలు పెట్టుకొని టెలిగ్రాముకోసం నిరీక్షిస్తూ వుండేవాడు. "త్వరలో ధనవంతుణ్ణయిపోతాను. ఎందుకు లోభత్వం" అని తన తాహతుకు మించి ఖర్చులు జమాయించేవాడు. కుటుంబపోషణార్థం నెలాఖరున అప్పులు చేయవలసి వచ్చేది. ఒక దమ్మిడీకూడా ఏ లాటరీలోనైనా ప్రైజు వస్తే ఒట్టు.

తన ఆశలన్నీ గాలిలో మేడలవుతున్నకొద్దీ అదృష్టదాసుకు చక్రవడ్డీ వలె కొత్త ఆశలు వృద్ధి అవుతున్నాయి. ధనవంతుడు కావాలని నుదుట వ్రాసివుంటే ప్రయత్నంలేకుండానే తన్ను అదృష్టం వలచి వస్తుందని ఒక వైపు ఆశలు మెదులుతూ వుండేవి. ఎన్నటికీ అదృష్టదేవత తనవైపు

శ్రీ డొంకాడ అప్పలనరసయ్య

చూడదేమో, నిర్భాగ్యదేవత వీడదేమో అని నిరాశభావాలు తొండవిస్తుండేవి.

ఈ ప్రకారం అదృష్టం ఒక వైపూ, నిరాశ ఒకవైపూ అంతరంగంలో వుంటే తనకు హాయి యెక్కడనుండి వస్తుంది? ఇలా భావసంఘర్షణలు జరుగుతూవుండగా, దీక్షతో ప్రయత్నించి పాటుపడితేగాని కోర్కెలు కొనసాగడానికీ ధనప్రాప్తికీ వీలు లేదని మనస్సులోని ఏ అంతర్భాగంనుండో ఒక శబ్దం వినిపిస్తూవుండేది.

ఇలాంటి ద్వంద్వస్థితిలో మనస్సు సులభమార్గం వైపే మొగ్గింది. స్టూడెంట్సుకు రెడీమేడ్, ప్రశ్నోత్తరాలుగల నోట్సు మీదా, పరీక్షకు ముందు పైవాళ్లనుండివచ్చే హింట్సమీదా, రోగికి చవకరకం మందులమీదా, దేవుడి దయవల్ల కోర్కెలు సఫలం చేసుకుందామని కోవెలకు వెళ్ళేవాళ్లకు కొబ్బరికాయలు కొట్టడంమీదా మోజు వున్నటు. రోజులు జరుగుతున్నకొద్దీఅదృష్టదాసుకు అదృష్టదేవతారాధన హెచ్చు అయింది. ఉద్యోగకార్యాలలో శ్రద్ధా, ప్రయత్నమూ తగ్గజొచ్చినాయి. గాలిమేడల తాపీపనిలో నిమగ్నుడై పరధ్యానపు ప్రపంచంలో తరుచు నివసిస్తూ

వుండేవాడు. ఉద్యోగపుపనులు సరిగా చేయనందువల్ల పై అధికార్లు చీటికీ మాటికీ చిఱ్ఱుబుఱ్ఱులాడ్తూ వుండడమూ, జరిమానాలు వేస్తూవుండడమూ, దూరంట్రాన్సుఫర్లు చేస్తూ వుండడమూ జరుగుతూవుండేది.

ఎవరికో యెక్కడనో పాలందున్నతూ వుంటే నిక్షేపాలు దొరకడమూ, త్రోవలో నడుస్తూవుంటే నగలు దొరకడమూ - ఇత్యాదులు అదృష్టదాసు మెదడులో నిత్యం తిరిస్తూ వుండేవి. రైళ్ళలో చివరి స్టేషను దాకా ప్రయాణంచేసి అందరూ దిగేవరకూ వుండేవాడు; ఎవరైనా నోట్లు కట్టలు మర్చిపోతారేమో అని. సినీమాహాల్సులో ఆఖరువరకూ వుండేవాడు,నిండు మనీపర్సు దొరుకుతుందేమో అని. ఫలితం నహి.

ఇలా వుండగా, లక్ష్మీదేవికి కోపంవస్తే కోటీశ్వరుల భవనాల్లోనుండి జాడీలతో రహస్యంగా లేచిపోయి యింకొక అదృష్టవంతుడగు అర్హుడి యింట్లో బయలు పడుతుందని చాలా కాలంనుండి జనశ్రుతిగా వింటున్న కబుర్లు అదృష్టదాసు మెదడులో నాట్యం చెయ్యడం ఆరంభించాయి. ఆ ఆలోచనలు నెమరు వేస్తున్న కొద్దీ అద్వైతవాదియొక్క దేవునిలాగు, డాక్టరుల వైద్యనిదానంలోని క్రిములవలె, పట్నాలలోని దోమలమాదిరి, సర్వత్రా గోచరిస్తుండడం అనివార్యమయింది.

ఇంతలో ఆ సమీపగ్రామంలో ఒక పెద్ద షావుకారు దివాలాతీయడం జరిగింది. లక్ష్మీదేవి హఠాత్తుగా భూమి చీల్చుకుని లేచి పారిపోయిందనిన్నీ యింక యే అదృష్టవంతుడి యింట్లోనో బయలుపడుతుందనిన్నీ చుట్టుప్రక్కల గ్రామాలలో వదంతి రేగింది.



ఈసారి మట్టి పెల్లగించి గునపంతీసేసరికి, దానితో గోధుమవర్ణం కలది నంకరటింకరగా ఏదో హఠాత్తుగా లేచినట్లయింది.

"నాకంటె లక్ష్మీనివాసానికి పాత్రుడెవడు? నా అర్హత తెలియకపోవడానికి లక్ష్మీదేవి అంత తెలివి తక్కువదా? ఒకవేళ ఆమెకు తోచకపోయినా, ఆమె కొడుకేకదా బ్రహ్మదేవుడు. అతడు తన తల్లితో చెప్పడా యేమిటి—ఫలానావాడికి నుదుటవ్రాత యింత గొప్పగా వ్రాశానని? ఈ భాగ్యం నాదే, తప్పదు" అని అదృష్టదాసుకు గట్టినమ్మకం కలిగింది.

ప్రతి రాత్రీ సుమారు పన్నెండు గంటలకు లేచి యిల్లూ దొడ్డీ కలయదిరిగి వెదకేవాడు—భూమిలో యేదైనా పగులు కనిపిస్తుందేమోనని, "ఏమో, పరాయి ఇంటికి సరిగ్గా రావడానికి లక్ష్మీదేవి ఆడుది కాబట్టి సిగ్గుపడుతున్నదేమో? దూరదూరంగా ఉండి యెక్కడ బయలుపడదామా అని తొంగితొంగి చూస్తున్నదేమో? పోనీ, ఆమె సహజలజ్జను యీసారి క్షమిస్తాను. ఇంత ఆరాటపడుతున్న భాగ్యదేవతకు నేనే ఔదార్యంతో యెదురుగా వెళ్ళి స్వాగతం యివ్వడం నవీననాగరకతా లక్షణం" అని అదృష్టదాసు నిశ్చయం చేసుకున్నాడు.

ఆ గ్రామంలో నాలుగువైపులా సాయంకాలం అదృష్టదాసు ఒంటరిగా షయిరు వెళ్ళి భూమి పగుళ్లకోసం వెదకుతుండేవాడు. కొన్ని రోజులు తిరగ్గా తిరగ్గా ఒకనాటిసాయంకాలం తన అన్వేషణ ఫలించింది. ఒకచోట పగులు కన్పించింది. సంతోషంతో ఒళ్లు గగుర్పాటు చెందింది. లక్ష్మీదేవి ప్రోగ్రాంగురించి సూచనయిచ్చి ఆమె విధ్యుక్తధర్మాన్ని ఆమె నెరవేర్చుకుందనుకున్నాడు. ఆనందబాష్పాలు రాలాయి

అతనికా రాత్రి భోజనం సహించలేదు. ఎంత త్వరగా వెళ్లి నిధానం తవ్వి తీసుకువద్దామా అని ఆలోచన పరంపరగా రైలు

బండిలాగు ఉద్రేకంగా పరుగెత్తుతున్నది. భూమి బాగా పగిలివుంది కాబట్టి ఆట్టే లోతు తవ్వనక్కరలేదు. కాని యెన్ని గోలెములో, యెన్ని జాడీలో, యెన్ని పెట్టెలో! ఒక్కడే మోయడం అసాధ్యం కావచ్చు. భార్యకు చెప్పకూడదు. రహస్యాలు దాచలేకుండా స్త్రీలకు ధర్మరాజుగారి శాపమే వుంది. ఆ రాత్రికి తానొక్కడే మోయగల ధనం తెస్తాడు. తక్కినది అక్కడనే జాగ్రత్తగా మట్టిలో కప్పివుంచి రోజారోజా కొంతకొంతగా తెస్తూవుంటాడు. త్వరలోనే మేడలూ, కార్లూ, బంట్రోతులూ, తోటలూ, యేనుగులూ, మీటింగులూ ప్రెసిడెంటుగిరీలూ, టీపార్టీలూ, మెడనిండా పూలమాలలూ, మహారాజాధిరాజవైభవం—వహవ్వా!

అది వేసవికాలం రాత్రి, ఒంటిగంట అయింది. అదృష్టదాసు బయలుదేరేడు. ఒక చిన్న గునపమూ, ఒక బుట్టా తీసుకున్నాడు. వెన్నెలరాత్రేగాని మబ్బు వేసింది. అటూ, యిటూ, వెనక్కీ ముందుకీ చూస్తూ నడుస్తూ ఆ స్తలం చేరేడు. గునపంతో తవ్వడం ఆరంభించేడు. తన్మయత్వంతో తవ్వుతున్నాడు. బంగారుకాసులు మెరుస్తున్నట్టు అతనికి దృశ్యాలు గోచరిస్తున్నాయి. గల్లు గల్లు మన్నట్టు శబ్దాలు వినబడుతున్నాయి. తవ్వడం యెన్నడూ అలవాటు లేనందువల్ల చేతులు మండుతున్నాయి. ఉద్రేకం యెక్కువవుతూ వుంది. ధారలుగా కారుతున్న చెమటకు ఆగలేక చొక్కా తీసి క్రిందపెట్టేడు. గునపంతో తవ్వుతూ చివరవంచి మట్టి పెల్లగిస్తున్నాడు. తవ్వడం, మట్టి ఉబికించి గునపంపైకి తీయడం—తవ్వా, పెల్లగిస్తున్నాడు. తవ్వడం, మట్టి ఉబికించి గునపం పైకి తీయడం—తవ్వా, పెల్లగింపూ—అదే పని.

ఈసారి మట్టిపెల్లగించి గునపం చివర పైకి తీసేసరికి దానితో గోధుమవర్ణంగా వంకర వంకరగా ఒకటి హఠాత్తుగా వచ్చింది. బుస్సుమన్నట్టు తోచింది. శరీరం జలదరించింది.

అప్రయత్నంగా ఒక్క ఉరుకున నిలబడి "అమ్మో" అని అరిచి, వెనకకు రెండు గంతులు వేసి గబగబా ఊరివైపు పరుగెత్తేడు. ఊరు చేరి వీధిలో ముప్పై నలభై గజాలు పరుగెత్తేసరికి "దొంగ దొంగ" అని కేకలు వినవచ్చాయి. ఇద్దరు మోటైన మనుషులు అతన్ని పట్టుకున్నారు. "నేను దొంగను కాను. సంసారినే" అని తాను యెంత మొఱపెట్టినా వినలేదు. "దొరికితే దొంగలందరూ అలాగే అంటారు. అర్ధరాత్రివేళ ఒగరుస్తూ పరుగెత్తడమేమిటి, దొంగవు కాకపోవడమేమిటి? నడు పోలీసుస్టేషనుకు" అంటూ చెరొకరెక్కా పట్టుకొని తీసుకువెడుతున్నారు. గలాటా విని చాలామంది జనం చేరేరు. అందులో అదృష్టదాసుకు తెలిసినవాళ్ళు కొందరున్నారు. వాళ్ళను చూచి చాలా సిగ్గుపడ్డాడు. "అయ్యా, మీరా? ఏమిటి యీ విపరీతం?" అన్నారు, అతన్ని దూషిస్తున్న తక్కినవాళ్లను వారిస్తూ. ఆ సమయంలో అతనికి దానిధర్మమా అంటూ ఒక అబద్ధం తళుక్కున స్ఫురించింది. "దేహబాధ తీర్చుకోడానికి వెళ్లి చెరువు నుండి వస్తుంటే పాము వెంట తరిమింది. అమాంతంగా తప్పించుకొని పరుగెత్తుకుంటూ వస్తుంటే నన్ను తెలియనివాళ్లు దొంగ అనుకొని పట్టుకున్నారు" అన్నాడు. "ఇంతేనా?" అనీ, "మహాధైర్యవంతుడవే!" అనీ నలుగురూ నవ్వుకొని అతని దండలు వదలి, వెంటవచ్చి అతని యింటివద్ద దిగబెట్టి వెళ్ళేరు. అతనికి తెల్లవార్లూ యిక నిద్రపట్టలేదు. ఒక కునుకుపట్టడం, జాడీలలో నగల మెరుపులూ, పాములూ, దొంగలూ కనిపించడం మెలకువ వస్తూవుండడం. ఆ వొక్క రాత్రీ అతనికి వొక శతాబ్దంవలె దీర్ఘంగా తోచింది.

ఆ మరునాడు గ్రామంలో అనుకున్నారు: "ఒక బుట్టా, చొక్కా, గునపమూ, ఒక గుడ్డపీలికా కొత్తగా తవ్విన ఒక గొయ్యిదగ్గిర కనుపించినాయి" అని. "గుడ్డపీలిక మబ్బులో యెంత గాబరా పెట్టింది నన్ను!" అని అదృష్టదాసు అనుకొని తనకు తెలియనట్టే నోరు మూసుకున్నాడు.

మరపునకు రాకుండా గుండె జలదరింపచేసే ఆ రాత్రి సంఘటనతో, అదృష్టలభ్యానికీ, అప్రయత్నకుబేరసిద్ధికీ బాల్యంనుండీ తనకు వుండే దురాశలకీ అతడు తిలోదకాలు విడిచేడు. "కాకన్మానవు పూర్వజన్మకృతములౌ కాగల్గు నర్థంబులున్", "కానున్నది కాకపోదు కమలజాకైనన్" మాదిరి అర్థాలతో సోమరిపోతులు కర్మ సిద్ధాంతానికి ముడిపెట్టే విపరీతార్థాలు అతని మనస్సునుండి పటాపంచలయిపోయినయి.

అతని అంతరంగంలో ఆనాటినుండీ గొప్ప సంచలనం ఆరంభమయింది.

అదృష్టంమీద ఆధారపడడంవల్ల కలిగే అనర్థాలు స్వానుభవంమీద తెలుసుకున్నాడు. బాల్యంనుండీ యింతవరకూ జరిగిన సంఘటనలవల్ల గుణపాఠం నేర్చుకొని, గతానికి స్వస్తిచెప్పి, జీవితంలో క్రొత్తశకం ఆరంభించాలని దృఢంగా తీర్మానించుకున్నాడు.

ఈ సమయంలో అతనికి ఒక నూతన వ్యక్తితో పరిచయం కలిగింది. ఆ వ్యక్తి తన వృత్తిలో మిక్కిలి దీక్షతో పరిశ్రమ చేస్తూ, తీరుబాటు వృధాగా పోనీయకుండా విపులంగా గ్రంథపఠనం చేస్తుండేవాడు. అతని సంభాషణయందలి విజ్ఞానమూ, ప్రపంచంలో పేరుగాంచిన అనేక మహానుభావుల జీవితచరిత్రలనుండీ మనస్తత్వశాస్త్రమునుండీ అతడు యేర్చిచెప్పే విషయములూ క్రమంగా ఆకర్షించడంవల్ల అదృష్టదాసు అతనితో స్నేహం వృద్ధిచేశాడు. ఆఫీసునుండి వచ్చినవెంటనే అతనివద్దకు వెళ్లి అతని భాండాగారంలోని గ్రంథాలు చదివేవాడు. విమర్శనాదృష్టితో, సత్యాన్వేషణబుద్ధితో, యే దేశపు మహాగ్రంథాలలోని అంశాలు చూచినా, యే మహానుభావుని జీవితం గురించి చదివినా, ఆత్మవిశ్వాసం, దీక్షలతో గూడిన స్వప్రయత్నమే కార్యసాఫల్యానికీ, జయానికీ, అభివృద్ధికీ, సంకల్పసిద్ధికీ, ఏకైకమార్గమని తెలుసుకున్నాడు.

"అదృష్టదాసు" అనే పేరు వుంటే అదృష్టంమీద ఆధారపడే సోమరితనం తిరిగి దాపురిస్తుందేమో అని, ఆ పేరు తీసివేసి "ప్రయత్నారావు" అనే క్రొత్త పేరు ధరించాడు.

"యో యో యథా ప్రయతతే
స స తత్తత్ఫలైక భాక్ ।
నతు తూష్ణీం స్థితే నేహ
కేనచిత్ప్రాప్యతే ఫలమ్ ॥
అత్రైకం పౌరుషం యత్నం
వర్జయిత్వేతరా గతిః ।
సర్వదుఃఖ క్షయప్రాప్తౌ
న కాచి దుపపద్యతే ॥"

—యోగ వాశిష్ఠం.

(ఎవరెవ రేవిధంగా ప్రయత్నిస్తారో, వారు వారా విధంగా ఫలితాలను అనుభవిస్తారు. కాని ఊరక కూర్చున్నందువల్ల ఏ ఫలితమూ పొందబడదు. సమస్త దుఃఖాలను పోగొట్టుకొనడానికి *పురుషప్రయత్నము తప్ప వేఱొకమార్గము పనికిరాదు.) ★



యజమానురాలు నౌకరు పిల్లతో:- ఏయ్ పిల్లా! నేను అట్టే మాట్లాడేరకం మనిషిని కాను. వేలితో ఇలా అన్నానంటే రమ్మని అర్థం తెలిసిందా?

నౌకరు పిల్ల:- నేనూ అంతేనండీ, అట్టే మాట్లాడను. తల ఇలా ఊపానంటే రానని అర్థం.




వైకుంఠరావుకు భార్య కాపురానికి రావటంతోటే అన్ని సమస్యలకంటే పరిష్కారం చేయాల్సింది ఆమె సమస్యే అయింది. కమల చిన్నతనం నుంచి ఒంటరితనంగా పెరగటంవల్ల — ఆమెకు అడ్డంకు లేమీ లేకపోవటంవల్ల మొద్దునిద్దుర కలవాటుపడింది. అంతే కాదు. ఆమె — ఆ నిద్రపోయేసమయంలో యే ప్రపంచంలో ఉంటుందో ఊహించటమే కష్టం. ఆమెశరీరమే ఆమెకు తెలియదు.

కమలయింటివద్ద ఆలాటి అలవాట్లు చేసుకొన్నా అభ్యంతరం చెప్పేవారుండరు; కన్నవారికి పిల్లలను కన్నుఅలో పెట్టి పెంచుకుంటూంటారు గదా! అయితే అది అత్తింట కుదురదుకదా!

కమలసంగతి పూర్తిగా తెలియనప్పుడు వైకుంఠరావు కొత్తగా దాంపత్యంలో అడుగుపెట్టటంవల్ల యేర్పడిన బద్ధకమనుకొన్నాడు. ఆ విధమైన ఉద్దేశంతోనే, అత్తారింట ఉన్న పదిహేను రోజుల కాలంలోనూ — చూసీ చూడనటు ఊరుకొన్నాడు. అయితే అది నానాటికి అభివృద్ధి పొందుతున్నట్టుగా అతడికి తోచింది. స్వగృహంలో చూపే బద్ధకం తన యింట్లో గూడా చూపిస్తే చాలా చిక్కులుపడాల్సివస్తుందని వైకుంఠరావు ఊహించాడు. ఆ తలంపుతోనే కమలతో నాందీప్రస్తావనగా అతడన్నాడు! "అంత హెచ్చుగా నిద్దురపోవచ్చా" అని.

'ఏం?' అదోవిధంగా కమల వైకుంఠరావు వైపుచూసింది.

'ఆడాళ్ళు అంత మొద్దు నిద్దుర పోగూడదు'—

'సరే అయితే'—ఇవి కమలమాటలు.

—ఈమాటలు వైకుంఠరావుకానందాన్ని కల్గించాయి. కమల యెదురు చెప్పనందుకూ తన యిష్టప్రకారం నడుచుకుపోటానికి అంగీకరించినందుకూ అతడెంతో సంతోషించాడు. కానయితే ఆ మాటల్లు మాత్రం అమలులోనికి రాలేదు.

తర్వాత దినమే, తెల్లవారినతర్వాత గూడా నిద్రపోవటం వైకుంఠరావు గమనించాడు. పుట్టిల్లు కనుక ఆలా నిద్రపోయినా, ఆలా నిద్రసాగించటం అతడికిష్టంలేదు. లేపి వైకుంఠరావు కమలతో అన్నాడు:

'అయితే నీకా మొద్దు నిద్దుర పోదన్నమాట!'

'ఏమండీ?'

'ఏమండీ యేమిటి? ఆలా వేళా పాళా లేకుండా నిద్రపోవటమే... తెల్లవారి యెంతసేపయిందో చూడు."

'అయితే యేం? పనిలేనప్పుడు?'

—వైకుంఠరావుకు కమల కొత్తగా మాట్లాడినట్టు తోచింది.

'పరుంటే పని వస్తుందేమిటి? నిర్భాగ్యులకు నిద్రవస్తుందట—దేనికయినా ఒక హద్దుండాలి. అంత నిద్రా'

'పోనీ నేను నిర్భాగ్యురాలనే అనుకోండి. నేను లేచిన గంటన్నరవరకూ మీరు మంచంమీంచి లేవరుకదా... అయితేమీరు...' కమల చొరవగా అనేసింది.

వైకుంఠరావు కప్పుడు నవ్వు, సిగ్గు మిశ్రితమై కలసి వచ్చాయి. అవును. కమల అన్నమాటల్లో అసత్యం ఎక్కడుంది? అయినా తాను మగవాడు. అందువల్ల సక్రమమైన జవాబు వెంటనే చెప్పలేకపోయినా 'అయితే నీకూ నాకూ సాపత్యమా... ప్రొద్దుట లేచినది మొదలు, తిరిగి రాత్రి పడుంవాళ్ళేదాకా—ఏదో పని చేస్తూండాల్సింది నువ్వుకాని నేనుకాదు గదా'-అని మాత్రం అన్నాడు.

'నేనే ఆ పనులు చేయాలనుకోండి... అయితే?' కమల ప్రశ్నించింది.

'మీ రాలాంటప్పుడు-పని చేయటంకోసం లేవద్దూ'

'లేవాలి...అయితే దానిగ్గూడా అవసరం ఉందిగా!'

'అంటే?'

'మా యింట్లో ఉన్నంతకాలం మా వాళ్లు పని ముట్టుకోనియ్యరు. పైగా ఇంట్లో అన్ని పనులూ పనిమనిషే చూసుకుంటుంది మరి తెల్లవారకండానే లేస్తే మాత్రం చేసే పనేముంటుంది?-ఒకవేళ మీ

యింటికి వస్తే చేతినిండా పనిఉండ వచ్చేమోగాని యిక్కడ లేదు."

కమల యీలా అనటం, తర్వాయిగా వైకుంఠరావు 'కొంగడా'! మొఖం పెట్టాడు. అతడిప్పుడు యిరుకున పడ్డాడు. కమలకు జవాబివ్వడానికి కొంచెం జాగుచేయటం తికమకపడటం జరిగింది.

'అయితే-మీ యింటిదగ్గర సాగుతుంది కనుక ప్రొద్దెక్కి లేస్తే-ఆ అలవాటు మా యింటిదగ్గర వద్దంటే పోతుందా'-అన్నాడేలాగో వైకుంఠరావు.

'ఆ భయం మీ కొద్దులెండి...ఎక్కడ యేలా నడుచుకోవాలో యిదివరకే మీరు చెప్పారుగా!'-అంది కమల...

వైకుంఠరావు నోటికి తిరిగి మాట పడింది. అతడా దినానికి ఆమెకు జవాబివ్వ లేకపోయాడు...

ఆ రాత్రి-అతని ప్రశ్నకు జవాబు దొరికినట్టుంది. అదయినా-ప్రార్థనాపూర్వకమైన కోరికతో నిండిన జవాబు!

'కమలా...ఏలాగయినా-నీ వొళ్లు నీకు తెలియని పరిస్థితుల్లో పోతున్న యీ మొద్దు నిద్ర నువ్వు తగ్గించుకోవాలి' - అన్నాడతను.

'తిరిగి మొదలెట్టాలా?'-అంది కమల.

'అదికాదు కమలా! బద్దకంలో ఉండి నువ్వు పడుకున్నా నా కభ్యంతరం ఉండదు. కాని మా యింటి సంగతి కొంచెం గాదు. ఇక్కడ నీ రాగం అక్కడ సాగుతుందా? మీ నాన్న బాగా ఉన్నవాడు కాబట్టి నౌకర్లనూ, చాకర్లనూ పెట్టి యింటెడు పనీ చేయిస్తున్నారు; మా యింట ఆలా కుదరదు...ప్రతీపనీ స్వయంగా చేసుకు తీరాలంటాడు మా నాన్న. మా అమ్మ అంతే - దాసీచేత కనీసం అంట్లయినా తోమనివ్వదు. అందువల్ల...!'

'ఏం చేయమంటారూ?'-అయోమయంగా అంది కమల.

'చెప్పేది విని ఆలోచించు కమలా... మా యింటిదగ్గర మీ యింటిదగ్గర విధంగా-ప్రొద్దెక్కి నిద్రలేవటం, నిద్రలో వళ్లు తెలియని స్థితిలో ఉండటం-మానుకొని యిక్కడ ఊగుతున్నట్లుగా నిశ్శబ్దంగా ఉంటే బాగుండదు... నే ఒకవేళ ఊరుకుంటే-అంతా అప్పుడే పెళ్లానికి దాసుడై పోయాడంటారు.'

'బాగుంది'-ఒక్క నవ్వు నవ్వింది కమల!

'బాగుండేమిటి...నువ్వు ప్రొద్దెక్కేదాకా నిద్రమంచం విడిచి లేవకపోయినా వళ్ళు తెలియని స్థితిలో నిద్రపోయినా-నేనేలాగో సరిపెట్టుకుపోయినా-వాళ్ల సంగతి యేమాత్రం నువ్వు యోచించ లేదు. కొంచెం దూరం ఆలోచిస్తే నీకే తెలుస్తుంది'-యేలాగో అన్నాడు వైకుంఠరావు.

కమల నిశ్శబ్దంగా ఆలోచిస్తోంది. వైకుంఠరావే తిరిగి అన్నాడు! "నేనే నీకీ మొద్దు నిద్దుర అలవాటు చేశా నంటారు. బొత్తిగా భర్తంటే భయంలేని భార్యంటారు. ఇంకా యేమిటేమిటో నిష్ఠూరా లాడుతారు. హిందూ సాంప్రదాయాలు యీ యింట మంట కలిశాయంటారు'-అని.

'తెలిసిందండీ బాబూ తెలిసింది-ఇంతకీ మీరు నన్ను నిర్బంధించేది-పెందరాళే నిద్రలేవమనేగా' తెలివి వచ్చిన దానిలాగ అంది కమల.

'అవును...అంతే, కాదు....నిద్రపోయేటప్పుడు కొంచెం తెలివిగా ఉండమని కోరుకొంటున్నా. నిద్రపోయేటప్పుడు-నీ వళ్ళు నీకు తెలియదు...ఎన్ని కేకలేసినా పల్కవ్. ఆ బద్ధకం యేలాగయినా పోగొట్టుకోవాలి!'

'సరేలెండి!'

'నామీదనున్న ప్రేమ ప్రదర్శించటానికి ఇదే ముఖ్యం' తడబడుతూ అన్నాడు వైకుంఠరావు ఆమెను దగ్గరకు లాక్కుంటూ.

'సరేలెండి...తెల్లవారుజామున తప్పక





డాక్టరు:-ఏమిటి మీ జబ్బు?

రోగి:-రాత్రిళ్లు నిద్ర పట్టడం లేదండీ.

డాక్టరు:- పడుకోబోయే ముందు ఏమన్నా తిని పడుకోండి.

రోగి:- అదేమిటి డాక్టరుగారూ! అయిదారు నెలల కిందట మీరే చెప్పారు గదా, పడుకొనేటప్పుడు ఏమీ తినవద్దని?

డాక్టరు:- (గంభీరంగా) హు! ఈ అయిదారు నెలల్లో వైద్యశాస్త్రం ఎంత పురోగమించిందో మీకేం తెలుసు?

లేపండీ'-అంటూ కమల అతడి దగ్గరికి జరిగింది.

*           *           *

వైకుంఠరావు మాటల ఫలితంగా, కమలలో ఆ మర్నాడు కొంచెం మార్పు కన్పించింది. ప్రతిదినం - తెల్లవారిన తర్వాత 'ఏమేవ్...నిద్రలేవవేవ్' - అని వైకుంఠరావు పదిపదిహేనుమార్లు పాటపాడగా "అబ్బ యేమిటండీ చంపుతారు'-అంటూ కళ్ళు తెరచేది...కళ్ళు తెరచిన అరగంటకు మంచం దిగేది...అలాటిది-ఆ దినం-వైకుంఠరావు 'ఏయ్'-అని అనటం తడవుగా...'ఆ'...అంటూ...కళ్లు నులుపుకుంటూ మంచంమీద లేచి కూర్చుంది...

'ఇంకా తెల్లారలేదు....'లేచావే....నువ్వు చాలా మంచిదానవ్' అన్నాడు వైకుంఠరావు.

'నా మంచితనానికేంగాని...రాత్రంతా ఒకటే కలలు. అసలు నేను నిద్రే పోలేదు...మీరెప్పుడు పిలుస్తారో అని...ఉలికులికిపడుతూనే ఉన్నా'

'భేష్...అయితే నీలో యిప్పటికి పతిభక్తి యేర్పడ్డదన్నమాట...మరి బద్ధకం ప్రదర్శించక - బయటకు పోయి, కాలకృత్యాలు తీర్చుకో'—

'మీరు మాత్రం!'

'మరికాసేపు పడుక్కొనివస్తా!'

'మీకున్న బద్ధకం నాకు మాత్రం ఉండదుటండీ'—అని ఆవలిస్తూనే మంచం దిగింది కమల!...

ఆ దినం అంతా కమల బద్ధకంగానే ఉంది; కళ్లు ఎన్నోరోజులనుంచి నిద్రలేనట్లుగా గుంటలుపడి ఉన్నాయ్. పగటివేళల్లో నిద్రపోరాదని వైకుంఠరావు యెప్పుడో హుకుం జారీచేసి ఉన్నాడు. అందువల్ల కమల నిద్రపోవటం కల్ల అయింది. అయితే తల్లి మాత్రం కమల పరిస్థితి గమనించింది.

'రాత్రి నిద్రలేదు గావల్ను కాసేపు పోయి పడుక్కోవే తల్లీ' - అంది.

కాని - కమల పోలేదు. వైకుంఠరావు ఆనందం యినుమడించింది!

ఆరాత్రి వైకుంఠరావు కమలని యెన్నోవిధాలుగా పొగడాడు - ఆమెనుంచీ ప్రతీ హిందూ గృహిణీ నేర్చుకొనవలసిన ఆదర్శసూత్రాలెన్నో ఉన్నాయన్నాడు; నువ్వు నాభాగ్యదేవతవన్నాడు; మరేమేమో అన్నాడు. అయితే నిద్ర బద్ధకంలో ఉన్న కమలమాత్రం ఏమీ వినలేకపోయింది. ప్రయత్నించినా, ఆమె కనురెప్పలు విడివడలేదు...తెల్లబోతూ వైకుంఠరావు పడుక్కున్నాడంతే!

క్రితందినం లేపినట్లుగా తెల్లవారుతూండగా ముద్దుగా 'ఏమేవ్...' అని పిలచాడు—

కమల ఒళ్ళు తెలియని స్థితిలో నిద్రపోతూంది!

'ఏమేవ్'

'ఊ...'

'తెల్లవారింది'

'ఊ'

'లేవవేం ?'

'అబ్బ !'

వైకుంఠరావుకు చచ్చినంత పనయింది!

'నిన్నే'

'ఊ...'

'కమలా !'

'ఏమండీ !'

'తెల్లవారిందండీ కమలాంబగారూ !'

'బాగుంది'

'ఏయ్—'

'ఊ'

'ఓ మొద్దునిదురపోతున్న మొద్దమ్మగారూ నిద్రలేవండీ' - ఓపిక నశించినట్లుంది; వైకుంఠరావన్నాడు. కమల జవాబులేదు!

'ఏమే'

కమల జవాబులేదు కాని నోరు తెరచుకు, గాలి పీలుస్తూ గాఢంగా నిద్రపోతూంది...

'ఏమే నువ్వు నిద్రలేస్తావా లేదా ?'- కచ్చితంగా అడిగేశాడు వైకుంఠరావు కోపాన్ని దాచుకోకుండా !

'ఉష్'

'ఏమిటే మొద్దూ...లే-' అంటూ జడ పట్టుకొని గింజాడు వైకుంఠరావు.

కమల తెలివికొచ్చింది...'అబ్బ యేమిటండీ" - అంటూ కళ్ళు తెరిచింది.

'ఏమిటండీ...ఏమిటి...మొద్దు నిద్దరా నువ్వూను. ఎంత సేపటినుంచి గోలెడుతున్నానో యేమో తెల్సునా ?'

'నిద్రవస్తూందండీ' ఆవలిస్తూ అంది కమల !

వస్తుంది ఎందుకురాదూ...చేసే పని లేకపోతే నిద్దరే...లే'—

కమల వైకుంఠరావు మాట విన్నట్టు లేదు. కళ్లు పెద్దవిచేస్తూ ఒకసారి భర్తవైపు చూసి, ఆవలించి' తిరిగి మంచంమీద పడిపోయింది...

వైకుంఠరావుకి చెప్పలేనంత కోపం వచ్చేసింది...తనకు తానుముందుగా మంచంమీంచి లేచాడు; లేచి, వొదిగి ఒకవయిపుకు పరున్న ఆమె వీపున అయిదువేళ్ళూ అంటుకొనేలా గట్టిగా చరిచాడు...

'అబ్బ !' అంటూ లేచింది కమల !

'ఊ...లే'—పళ్ళు పటపట లాడించాడు వైకుంఠరావు !— కమల కళ్ళల్లో నీళ్లు ప్రవేశించాయి. ఎవరూ కమల పట్ల చెయ్యి చేసుకునేటంత తీవ్రంగా యింతవరకూ ప్రవర్తింపలేదు. ఈ మహానుభావుడు మాత్రం చేశాడు ! 'బాగుంది...కంటినిండా నిద్రపోవటానికిగూడా నోచుకోలేదు...మరి బ్రతకటం అనవసరం...' అని బొంగురు కంఠంతో అంది కమల !

'బ్రతకటం అనవసరమే...అనంగతి నాకూ తెలుసు...మరి దేవుడెందుకు పుట్టించాడంటావ్ ?'

—కమల జవాబుచెప్పలేదు...వెక్కివెక్కి కొద్ది నిముషాలు యేడ్చి, కళ్ళనీళ్ళు

మొత్తంమీద తుడుచుకు, తలుపుతీసుకు వెళ్ళిపోయింది...

వైకుంఠరావు యేమిటో ఆలోచిస్తూ మంచంమీదనే ఉండిపోయాడు...

ఆ మధ్యాహ్నంయింట్లో మనుష్యుల నడవడికలో కొంచెం మార్పువచ్చినట్లుగా వైకుంఠరావు గమనించాడు...మధ్యాహ్నంభోజనాలు చేస్తూంటే...కమలతల్లి: 'అమ్మా నువ్వుగూడా రావే' అని కూతుర్ని పిలిచింది!

కమల ప్రత్యుత్తరం లేదు!

'అది పడుకుంది కాబోలు. పడుకోనీ...నిద్ర లేకపోతే దాని ఆరోగ్యం పాడవుతుంది; చిక్కి శల్యమవుతుంది'— అన్నాడు కమలతండ్రి—

వైకుంఠరావుకా మాటలు తనన్నుద్దేశించి చెబుతున్నట్లుగా తోచింది.

అతడు మాట్లాడక భోజనం చేశాడు; అతడి భోజనం తర్వాత కమల భోజనానికొచ్చింది ... తల్లిదండ్రులు అతి గారాబంతో, ఆమె నేమిటో చెప్పి లాలనగా భోజనం చేయింపిస్తున్నారు. ప్రక్కగదిలోనే కూర్చున్న వైకుంఠరావుకది కళ్ళమంట తెచ్చేదిగా ఉంది; అయినా అతడేం చేయకుండానే ఉన్నాడు... అత్త అంది: 'మనుష్యులయి పుట్టిన తర్వాత నిద్దరపోకండా ఉంటారా... ఏమిటో పెంకితనం కాకపోతే-నిద్రలేవకంత మాత్రన, వీపు మీద చెళ్ళు మనికొడ్తారా...మీరు వూరుకుంటే ఊరుకోండి కాని, నే ఊరికోనేది లేదు. నే అడిగేస్తాను'-వైకుంఠరావు ప్రాణాలు యెక్కడి వక్కడికి యెగిరిపోయాయి. నయాన చెప్పాలికాని, అలా గంతులువేసి రచ్చకెక్కితే యెట్లా? ఏమయినా, ఏం చేసినా, అతను మన యింటి అల్లుడూ, కమల మనబిడ్డ...సామరస్యంకోసం సరసంగా మాట్లాడాలి కాని, అలా గంతులు వేస్తే ప్రయోజనం ఉంటుందా' అన్నాడు మామగారు

'ఎందుకులెండి...నాన్నా...ఊరుకోండి...'-కమల అంది...ఆమె వీపు మీద చరచిన సంగతి వీరందరికీ యెలా తెలిసిందో...కమల చక్కని మాటలే అంది...అవును. ఆ సంగతి వాళ్ళిద్దరకూ సంబంధించినది కాని ముసలివాళ్ళకు సంబంధించింది కాదుగదా!

అయితే కమలమాటలు వైకుంఠరావు మరింత కోపాన్ని తెప్పించాయి. అసలు తానింట్లో నిద్రపోతున్నాననే తలంపుతో వాళ్లు సంభాషణకుపక్రమించి ఉంటారు...లేకపోతే అవిధంగా వాళ్లో

రణి పెంచరు... నిద్రపోతేమాత్రం మాటలు వినపడకపోతాయా? బహుశా ఆ తల్లిదండ్రులు కూడా కుమార్తెయొక్క నిద్ర బద్ధకాలు, కలిగియుండి; నిద్రపోయే సమయంలో ఒళ్లు తెలియని పరిస్థితుల్లో వారయ్యి ఉండాలి. కాకపోతే అవిధంగా మాట్లాడుతారా?

'మీ రడుగుతారా... నన్నడగమంటారా?'-అందిఅత్తగారు.

'మా గొడవ మీ కెందుకే అమ్మా ఊరుకోవే'—కమల అంటూనే ఉంది.

నీ గొడవేమిటి... మొగుడి మొఖం చూసి పదిరోజులయిందో లేదో అప్పుడే అతణ్ని వెనకేసుకు వస్తూంది; నీకయితే అతడిమీద ప్రేమ ఉండచ్చుగాని, కన్నకడుపయిన తర్వాత-నిన్నిలా హింసిస్తే మనస్సు వప్పుకుంటుందా'

'నువ్వు దానగవసరంలేదు! నేనే అడుగుతాను! అతను నిద్రలేచిన తర్వాత నెమ్మదిగా!'-అన్నాడు మామగారు!

వైకుంఠరావు పెద్ద చిక్కులో పడ్డాడు. ఆయన తన్ను క్రాసుపరీక్ష చేయటమా? ఎంత అప్రదిష్ఠ. కళ్లుమూసుకు మంచంమీద వైకుంఠరావు పడున్నాడన్నమాటే గాని నిద్రపోలేదు.. ఏం నిర్ణయానికి వచ్చాడో గాని, మూడు గంటలవేళ—తన గదిలోకి మామ అడుగు పెట్టటం తర్వాయిగా 'ఈపూట వెళ్ళిపోతున్నానండి!' అన్నాడు!

ఆయన తెల్లమొఖం వేశాడు!

'ఈ నాలుగున్నరగంటల బండికి వెళ్లిపోతున్నా...'

'ఈ హడావిడి దేనికి?'

'పది పదిహేను రోజుల్నుంచి యేకధాటిగా ఉన్నాను కాదండీ'

'వెళ్లుదువుగానిలే'

'వెళ్లిపోవాలండి'

'అంతేనంటావా'

'అవునండి!'

'నీ యిష్టం—' 'మంచిది చూసి, మా వాణ్ని పంపించుతాం...మీ అమ్మాయిని పంపండి'

'బాగుంది—అసలు నువ్వింత అనుకోకుండా బయలుదేరటం యేం బాగులేదు!'

'బాగుండేదు లెండి! వెళ్తాను!'

ఆయన యేమో చెబుదామనుకొన్నాడు; కాని చెప్పలేకపోయాడు; వైకుంఠరావు ప్రయాణం నిశ్చయం అయింది...

వైకుంఠరావు బయలుదేరాడు.

ఏమేమో గింజుకొన్న అత్తగారి నోరు బయటకు రాలేదు; మామ తన ప్రయాణానికి సర్వసన్నాహాలూ చేశాడుగాని కిమ్మనలేదు. జరిగినదంతా మరచినట్లుగా కమల—తన గదిలోకి రెండుమూడుమార్లు రావటం ఏవో కంటిసౌంజ్ఞలు చేయటం, చిరునవ్వు నవ్వటం వైకుంఠరావు గమనించాడు; అయితే అతను మాత్రం మనస్సు మార్చుకోలేదు...వెళ్లిపోతూ కమలతో అన్నాడు: 'నే మరి రాను...మావాడు వస్తాడు...రా'—అని.

'అలాగే'—అంది కమల!

వైకుంఠరావు వెళ్లిపోయాడు! కమలతల్లి తెల్లబోయింది.

* * *

కమల—అత్తవారింటికెళ్ళినఅయిదారు మాసాల తర్వాత పుట్టింటికి వెళ్లింది... కమలలో మార్పుతో తల్లి...ఆమె చేతిమీద ఒక పొడుగాటి చార కూడా చూసింది:

యోగక్షేమాలయిన తర్వాత 'అదేమిటే కమలా...ఆ పొడుగాటి చార—' అని అడిగింది!

'ఆ...అదా! వాత!'—అని నవ్వి ఊరుకుంది కమల!

'వాతా? ఎక్కడిది?'

'మా అత్తగారు పెట్టింది'—కమల నవ్వుతూ అంది!

'అయ్యో వాళ్ళదుంప తెగ.....వాళ్ల వంశం నశించ...ఎంత గడుగ్గాయిముండ. తల్లి ఊరికే తిట్టిపోస్తూంది.

'ఆగే అమ్మా? నేనే పెట్టించుకొన్నాను'—

'అంటే - తెల్లబోతూ ప్రశ్నించిందావిడ!

'ఏం లేదే...మనింట్లో మల్లే ప్రొద్దెక్కి నిద్రలేవటం, ఆ యింట్లో యెవ్వరికీ అలవాటు లేదు. నేను పెందరాళే నిద్రలేవటం కోసం యెంతో ప్రయత్నించాను. అయితే మనింట్లో అలవాటయినది. యీ మొద్దునిద్దుర—యీ వాతతో గాని పోలేదు'

'నాకేం అర్థమవటం లేదు'

'అర్థమాటానికేముందే—అలవాటు పోగొట్టుకోటం కోసం యెన్నో ప్రయత్నాలు చేశాను. ఏదీ ఫలవంతమవలేదు. చివరకు నాకోర్కె మీదే—ఆయన అత్తగారిచేత సన్నగా వాతవేయించారు. అప్పటినుంచీ నిద్ర మాయమయింది' అని నవ్వుతూ అంది కమల!

'ఎంత చిత్రం!'-అని బుగ్గనొక్కుకుంది తల్లి!

★



కొడుకు:- నాన్నా ! నువ్వు చిన్నప్పుడు బళ్లోకెళ్లేవాడివా !

తండ్రి:- ఆ. ప్రతిరోజూ వెళ్లేవాణ్ణి.

కొడుకు :- (తల్లికేసి తిరిగి) చూశావా, అమ్మా ! బళ్లోకెళ్లినందువల్ల లాభం లేదని నేను ఎన్నిసార్లు అన్నా నువ్వు విన లేదు.

# పరారి

(15-వ పేజీ తరువాయి)

తాడు. తలటక్కని కొట్టుకుంటుంది. కుప్పలా కూలిపోతాడు.]

యువతి : అరెరె.

డె : అబ్బ. పరుగెత్తు. ఊ పారిపో.

యు : (నిశ్చేష్టురాలౌతుంది) రాటకి కొట్టుకుంది తల. టక్కమని చప్పుడైంది విన్నాను. చూడు కదలడం లేదు.

డె : అవును. దెబ్బకి దిమ్మతిరిగింది. (పోలీసుని సమీపిస్తాడు. వొంగిచూస్తాడు) అరె ! రాట తగిలిందా !

[యువతి పోలీసు గుండెలపై చెయ్యి పెట్టి పరీక్షిస్తుంది.]

యు : అరె ! చూడు.

డె : ఆరి దేవుడా! గట్టిదెబ్బే తగిలిందే!

యు ; పోట్లాడివద్దంటే విన్నావు కావు. పోట్లాటెందుకు చెప్పు ? (అతని చెయ్యి అందుకుని) నడు. గబగబా పారిపోదాం ఎవళ్ళూ రాకముందే. ఇదిగో ఈ పచ్చిక దాటి అల్లా పోతే తప్పించుకోవచ్చు. ఎవరికి తెలుస్తుంది ?

డె : (ఏదో ఆలకిస్తూ) పాపం. వీణ్ణి ఇల్లా విడిచిపెట్టి పోకూడదు. అదుగో నీడి టోపీ తీసుకెళ్ళి కొంచెం నీళ్ళు తెచ్చిపెట్టు.

[యువతి టోపీ అందుకుని ఎటూ ఏం చెయ్యడానికీ తోచక నిలబడిపోతుంది.]

యు : (బాధతో) ఒద్దు ఒద్దు. రా పోదాం. అబ్బ ! ఎంతపని జరిగింది ! చూడు అసలు వాడు చచ్చిపోయాడేమో చచ్చిపోతే ! అమ్మయ్యో ! (డెనాంట్ చెయ్యిపట్టుకు లాగుతుంది)

డెనాంట్ : (ఆమె చెయ్యి విదిల్చి) ముందు నీళ్ళు తెచ్చిపెట్టు వెర్రివేషాలెయ్యక. ఊఁ వెళ్ళు.

(యువతి చేతులు నులుపుకుంటుంది తరవాత టోపీ అందుకుని పరుగుతీస్తుంది. డెనాంట్ వొంగుని పోలీసు కణతలు రుద్దుతూ ఉంటాడు. నాడిచూస్తాడు. తరవాత గుండెపైన చెయ్యివేసి చూస్తాడు.)

డె : అరె ! చిత్రంగా ఉందే !

(తల పైకెత్తి చూసేసరికి ఇద్దరు పోలీసులు ప్రత్యక్షం.,

ఒక పోలీసు : ఏమిటది ?

డెనాంట్ : ఏమిటో నాకు తెలియడం లేదు. కొంచెం అనుమానంగా వుంది – ఇతను...

రెండో పోలీసు : ఏమిటి ? ఎవరితను ? (వొంగిచూసి) అరె మనవాడులా వున్నాడే! (నోటిదగ్గిర చెయ్యిపెట్టిచూసి) ఊపిరాట్టం లేదే ? ఏమిటయింది ?

డె : తల ఆరాటకి తగిలింది (ఇనపరాట చూపుతాడు)

పోలీసు : అతనిటోపీ ఏదీ ?

డె : పడిపోయింది. నీళ్లు తేవడంకోసం ఎవరో తీసుకెళ్లారు.

పోలీసు : ఎవరు ?

డె : ఒకమ్మాయి.

రెండో పోలీసు : ఈలకూడా కూడా. నువ్వు కొట్టావా అతన్ని ?

డె : చిన్నతగాదా వచ్చింది. నన్ను పట్టుకున్నాడు. నేను దవడమీదకొట్టాను. వెనక్కి తూలిపడ్డాడు. పడ్డంలో తలరాటకి కొట్టుకుంది.

పోలీసు : తగాదా ఎందుకొచ్చింది ?

డె : (వేదనతో తలపట్టుకుని) ఏమో ! ఏమిటో తెలీడంలేదు. అదో పాతకం!

పోలీసు : (రెండో పోలీసుతో) నేను ఆస్పత్రి కారు తీసుకొస్తా కాని, నువ్వు ఇతని దగ్గిరుండు. (డెనాంట్ తో) రా నాతో.

[తెర]



# విజ్ఞాన వీధులు

"డాక్టర్"



## 31. గ్రహణపు మొర్రిలా?

"గర్భిణులు గ్రహణకాలములో గ్రహణమును చూడకుండా కదలకుండా పడుకోకపోతే గర్భస్థ శిశువునకు ఏదో అంగవైకల్య మేర్పడుతుందంటారు. ఇది నిజమా?" అని తెనాలినుంచి చుండూరి రామచంద్రరావుగారూ, భీమునిపట్నం నుంచి గనగళ్ల సింహాచలంగారూ అడుగుతున్నారు.

కాదు. ఇది నిజము కానే కాదు. సూర్యుడి వెల్తురు భూమిమీదా చంద్రుడిమీదా పడినప్పుడు ఈ రెండింటికీ వెనకవైపున నీడలు ఏర్పడతాయి. భూమి చుట్టూ తిరిగే చంద్రుడు భూమినీడలో గాని ప్రవేశిస్తే, సూర్యుడి వెల్తురు అప్పుడు చంద్రుడిమీద పడదుగనక నీడదాకావచ్చిన చంద్రబింబము నీడలోకి పోగానే వెలుగు మాసిపోయినట్లు కనబడుతుంది. ఇదే చంద్రగ్రహణము.

భూమిచుట్టూ తిరుగుతున్న చంద్రుడు భూమికీ సూర్యుడికీ మధ్యకి వచ్చినప్పుడు చంద్రుడి నీడ భూమిమీద పడుతుంది. ఆ నీడపడిన భాగములోవున్న ప్రజలకి సూర్యుడు కనపడడు. అంటే అప్పుడు వారికి సూర్యగ్రహణమన్నమాట. అయితే, చంద్రబింబము ఈ మూడింటిలో చిన్నదీ, సూర్యబింబము పెద్దదీను. కనక సూర్యబింబానికి ఎంతోసేపు అడ్డుగా వుండలేడు చంద్రుడు. తరుచుగా చంద్రుడు సూర్యబింబంలో కొంతభాగానికే అడ్డువచ్చి సగము సగము గ్రహణమే కలిగిస్తాడు.

అయితే, సూర్యాస్తమయమూ, సూర్యోదయమూ అవుతూన్నప్పుడు సూర్యుణ్ణి చూడ్డానికీ, చంద్రుడు అడ్డురావడమువల్ల కొంత తెగిన సూర్యుణ్ణి చూడ్డానికీ తేడా యేమిటి? చవితి చంద్రుణ్ణీ గ్రహణపు చంద్రుణ్ణీ చూడడములో తేడా ఏమిటి? వీటిలో ఒకటే ఎందుకు నిషేధించాలి?

పాశ్చాత్యులలో ఈ నిషేధము లేదు ఒకటీ—గ్రహణాల్ని చూసిన గర్భిణులు అంగవైకల్యముగల బిడ్డల్ని కనరు, రెండూ—విరోధాలు పై నమ్మకానికి.

అంగవైకల్యము శిశువులలో కలగడానికి తల్లిదండ్రుల సుఖరోగాలు ఒక కారణము. ఈ రోగాలు తల్లిలో జీర్ణించి పిండరూపములోవున్న శిశువు శరీరభాగాన్ని తినేస్తాయి. పుట్టుకతోటే అంగవైకల్యము దాపురిస్తుంది ఆ శిశువుకి. ఇక పై పెదవి కుడి యెడమభాగాలు కలిసిపోక చీలినట్లుండడమూ, అలాగే అంగుడు కూడా చీలినట్లుండడమూ అసాధారణాలు. గర్భకోశములో పిండము ఉన్నప్పుడే జరుగుతాయి ఇవి. వీటికి కారణమంటూ తెలియరాలేదు. ఇవి గ్రహణపు మొర్రిలనడానికి వీలులేదు. ఏమంటారా? గ్రహణము చూచిన గర్భిణుల బిడ్డలకు ఈ వంకలే కలగలేదు. ఈ వంకలు కలిగిన బిడ్డల తల్లులు తప్పకుండా గ్రహణాన్ని చూచినవారు కారు.

గ్రహణసమయంలో భోజనము చేయకూడదని వెర్రి నిషేధమును నేను పాతికసార్లైనా అతిక్రమించాను. నాకు శూలనొప్పి రాలేదు. అక్కడి మొర్రి అసాధారణము, బిడ్డల మొర్రి కూడా అసాధారణము. అందుకని రెండింటికీ ముడిపెట్టారు గాని వేరేమీ లేదు. గ్రహణాలకి జీవముల మీద ఏవిధమైన ప్రభావమూ లేదు, ఉన్నదన్నవారు నిరూపించాలి.

## 32. గ్రహబలమా?

"మానవుని జీవితపునడక, రోగపీడితుడు కావడమూ మొదలైనవి వాని గ్రహబలముపై ఆధారపడి ఉంటాయంటారు. ఇది ఎంతవరకూ నిజమండీ?" అని నందికొట్కూరు నుంచి యం. భూషణంగారు అడుగుతున్నారు.

విజ్ఞాన శాస్త్రదృష్ట్యా మానవజీవితాన్ని నడిపే శక్తులు రెండే కనపడతాయి. ఒకటి ప్రయత్నబలమూ, రెండు పరిస్థితుల అనుకూల్యతా. మనదేశ స్వాతంత్ర్యానికి ఈ రెండు శక్తులూ తోడ్పడ్డాయి. సాధారణంగా మానవయత్నాల ఫలితాల్ని ఈ రెండు శక్తులయొక్క సారాంశ ఫలితముగా వివరించవచ్చును. వైజ్ఞానికులు ఎరిగినదింతే. అయితే కొన్ని అసాధారణ ఘటనలు దాపురించి, "ఇవి పరిస్థితులు కావు; ఏదో అదృశ్యశక్తి లీలలు" అని అనిపిస్తాయి. బెజవాడలో ఒకరు జబ్బు ఏమీ లేకపోయినా, బలానికని 'టానిక్కు' తీసుకుని రెండురోజులు తిరగకుండా చచ్చిపోయారు. మద్రాసులో ఒకరు దెబ్బ తగిలి ధనుర్వాత నిరోధక సీరమును ఇంజెక్షను పుచ్చుకుని ఆ రాత్రే మరణించారు. ఆ సీరము ఆయనకు మాత్రము వికటించింది. కలకత్తాలో ఒక విద్యార్థిని చదువుకుంటూ గ్యాసుదీపముతాడు తెగి మీదపడి బట్టలు అంటుకుని కాలిపోయి మరణించినది. మూర్ధాభిషిక్తులు కావలసిన ఖుస్రూ, దారాలు దుర్మరణము పాలైనారు. ఇలాంటి ఘటనలు, మానవచరిత్రలో ఎప్పుడూ జరుగుతూ, జీవితాల్ని గడిపే అదృశ్యశక్తులేవో ఉన్నాయనే నమ్మకము కలిగిస్తాయి.

జగన్నియంతయగు పరమేశ్వరుడొక్కడే అన్న నమ్మకము వ్యాపించకముందు, కాకసస్ పర్వతప్రాంతమందుండినారన్న ఆర్యులూ, మధ్యధరాతీర దేశస్థులూ కూడా సూర్యుణ్ణి ఆరాధించేవారు. ఈ రెండోవారు చంద్రుణ్ణీ ఇంకా ఇతర దేవతల్నీ కూడా కొలిచేవారు. కాలక్రమాన్ని నిశీధాకాశములో మినుకుమినుకుమనక ప్రత్యేక దీప్తులతో కనపడే శుక్రుడూ, గురుడూ, అంగారకుడూ, శనీ, బుధుడూ తెలిశారు. సూర్యదృష్టి లేనప్పుడు ప్రాణికోటి నిరుత్సాహంగా, నిస్సత్తువగా ఉండడమూ, అమావాస్యకీ పౌర్ణమికీ పిచ్చివారి అల్లరి ఎక్కువౌతూండడమూ గమనించినవారికి తక్కిన 'గ్రహాలు' కూడా మన జీవితాల్నీ మనస్సుల్నీ తిప్పుతూంటాయనే నమ్మకము కలగడము వింతకాదు. అప్పుడు ప్రారంభించి వుంటుంది జ్యోతిషశాస్త్ర నిర్మాణము. మానవుడు పుట్టిన ఘడియా, ఆ సమ

యంలోవున్న గ్రహస్థితి గమనించి, ఆతని జీవితములోని ప్రధాన ఘట్టాలకీ ఈ గ్రహస్థితులకీ సంబంధమేర్పరచి, పెక్కు జాతకులనూ వారి గ్రహస్థితులనూ పరిశీలించి, గ్రహాలప్రభావమిట్టిదని నిర్ణయించి ఉంటారు. దానితో మొదలు పెట్టి వుంటుంది జ్యోతిష్కుని ప్రత్యేకజీవనము (ముహూర్త నిర్ణయమూ, శాంతులూ తరవాత పుట్టివుంటాయి) ఈ శాస్త్రము శతాబ్దాల తరబడిని దిగివచ్చింది సంఘజీవనములోకి. ఆధునిక విజ్ఞానశాస్త్రము నేర్చిన వారు గ్రహాలకీ, జీవితాలకీ కారణకార్య సంబంధాన్ని అంగీకరించరూ, జ్యోతిష శాస్త్రాన్నీ నమ్మరూ. అయితే కొండ గుర్తులవలె జ్యోతిషశాస్త్రము చెప్పేసంగతులు తప్పక అనుభవమౌతాయని ఒప్పుకోక తప్పదు. మనముగ్రహించలేని అజ్ఞాత నియమమేదో గ్రహాలకి మనజీవితాలమీద అధికారము నిచ్చింది. ఇటీవలి జ్యోతిష్కులు ఆధునికులు దూరదర్శినీ సహాయమున కనిపెట్టిన ఇంద్రవరుణగ్రహాల ప్రభావాన్నికూడా విచిత్రజాతకుల జీవితాలలో పట్టి చూపిస్తున్నారు.

అయితే జ్యోతిషదృష్టిలో గ్రహబలమే బలము. గ్రహాలకు తప్ప ఇంకెవరికీ (పరమేశ్వరుడికి కూడా) మానవజీవితాన్ని నడుపగల సామర్థ్యము లేదు. కాబట్టి జ్యోతిష్కులు వారి శాస్త్రమును నమ్మితే నాస్తికులే అన్నమాట. ముహూర్తాలు నియమించడమూ, శాంతులు చెయ్యడమూ వల్ల "గ్రహశాంతి" జరుగుతుందని నమ్మితే గ్రహబలానికి తోడు పురుషప్రయత్నానికి కూడా శక్తి నాపాదించినట్లౌతుంది. గ్రహాలకే సర్వశక్తిని ఆపాదించే జ్యోతిషశాస్త్రానికి ముహూర్తభాగమూ, శాంతి భాగమూ మచ్చలు...జాతక చక్రము వెయ్యడానికి రాశి చక్రము అవసరము. రాసులు భారతీయులకు గ్రీకులు రాక ముందు తెలుసుననడానికి సాక్ష్యములేదు. గ్రహాలగుర్తింపుకి సాక్ష్యమైన వారముల పేర్లుకూడా అయిదోశతాబ్దము దాకా భారతదేశశాసనములలో గోచరించవు. కాబట్టి జ్యోతిశాస్త్రము మధ్యధరాసముద్ర తీరస్థదేశముల స్పర్శవల్ల భారతదేశానికి వచ్చియుండునని ఊహిస్తున్నాను.

ఇక సూర్య, వరుణ, అగ్ని, ఇంద్ర, దేవతలను అర్చించుచుండిన ఆర్యులుకాక సస్ పర్వత ప్రాంతమునుండి మనదేశానికి వచ్చారు. వీరు వేదాంతులు. ఉపనిషత్తులూ, బ్రహ్మసూత్రాలూ వీరివే. ఏకేశ్వరారాధన వీరి వేదాంతసూత్రాల్లో శుభ్రంగా కనపడుతుంది. జన్మాంతరమూ, కర్మసిద్ధాంతమూ కూడా వీరివే. అవాంతర సంఘటనలను ప్రారబ్ధకర్మ ఫలితములుగా వీరు సమర్థించుకున్నారు. అంటేవీరు సర్వజగన్నియంతయైన పరమేశ్వరునికి సర్వశక్తినిచ్చి, పురుషకారమూ, ప్రారబ్ధకర్మఫలమూ నడిపే జీవితమును పరమేశ్వరుడు తన ఇష్టము వచ్చినట్లు త్రిప్పగలడని నమ్మినారు.

నేటి భారతీయుల నమ్మకాలలో అటు మధ్యధరాతీరపు దేశముల నమ్మకాలూ, ఇటు ఆర్యులనమ్మకాలూ రంగరించుకున్నవి. జన్మాంతరరాహిత్యమూ, గ్రహబలమూ ఒకవైపూ; కర్మబలమూ, పురుషయత్నమూ, పరమేశ్వరకటాక్షమూ ఒకవైపూ లాగుతాయి. అది నాస్తికత్వమూ ఇది ఆస్తికత్వమూను. అయితే 'జన్మాంతరరాహిత్యమూ, గ్రహబలమూ' మీద పరమేశ్వరుని కధికారము వచ్చినది క్రైస్తవముతో ఇస్లాముతో. ఇక పరమేశ్వరుని సర్వశక్తి పీఠముపై నధిష్ఠింపజేసి ఈ నమ్మకాలను సమన్వయపరుచుకోవాలి.

జ్యోతిష్కులు ఆత్మనీ, పరమేశ్వరుణ్ణీ ఒప్పుకోరు. (నేటివారు ఒప్పుకున్నా ఆ నమ్మకానికి జ్యోతిషశాస్త్రానికీ విరోధమే) వేదాంతులు శరీరప్రాధాన్యతనీ,' గ్రహాల్నీ ఒప్పుకోరు. సమన్వయము చెయ్యాలంటే రెంటినీ ఒప్పుకోవాలి. ఒకరీతిగా సమన్వయము చెయ్యబోతాను చూడండి.

మానవుడు శరీరమూ, ఆత్మచేత ఏర్పడినవాడు. శరీరము గ్రహాలవలెనే పాంచభౌతికము కాబట్టి పాంచభౌతికములైన గ్రహాలప్రభావము శరీరమూ మెదడూ పైన వుంటుంది. ఇక చైతన్యమయుడైన ఆత్మ శరీరములో నివసిస్తున్నాడు! ఇతడు తన స్వత్వాన్ని గుర్తించుకుని మనస్సుకి కళ్లెము తగిలించి సర్వశక్తుని అన్వేషించెనా, "గ్రహబలమేమి? రామానుగ్రహబలమే బలము" కాక స్వార్థాన్వేషియై శరీరపోషణమే చేసెనా, "గ్రహబలమే బలము" తనువుపైనే గ్రహబలము కాని ఆత్మపైన లేదు. అయితే ఆత్మశక్తివల్ల గ్రహబలము ఒకప్పుడు మాయనూవచ్చును, లేదా శరీరాన్ని కొట్టనూ వచ్చును. దాని ధాకకు ఆత్మచలించనే చలించదు. పంజరముపై చిలకకు మమతవుండునా?, పంజరానికి తగిలే దెబ్బతనకే తగిలిందనుకునే చిలకకి గతి యేది?

## 33. డాక్టర్లు జ్వరం తెప్పించగలరా?

డాక్టర్లు జ్వరంపోగొట్టడానికి మందులిస్తారుగాని 'జ్వరం తెప్పించగలరా?' అని అడిగితే వింతగానే వుంటుంది. కాని, డాక్టర్లు జ్వరం తెప్పించగలరూ, తెప్పించుతారు కూడాను. 'ఎందుకోసం తెప్పించుతారూ' అంటారా? జబ్బులు పోగొట్టడానికి.

పిచ్చివారికి మెదడులో ఎక్కడో ఒకచోట జీవకణాలు ఎక్కువశ్రమ ఇవ్వడమువల్ల చచ్చిపోతాయి. అప్పుడు ఆ జీవకణాల ప్రత్యేకపుపనులు ఆమనిషిలో లోపించిపోతాయి. అప్పుడాతని ప్రవర్తన నిండుగా ఉండదు. దానినే 'పిచ్చి' అంటాము. మెదడులో ఒకచోట ఎక్కడో చచ్చివున్న జీవకణాలు ఆ మనిషి శరీరానికి హానిచేసి జబ్బుతెప్పించలేవు. అందువల్ల ఆ పిచ్చివాని శరీరములో (అందరిలోనూ వలెనే) సహజంగావుండే రోగనిరోధకశక్తులు మేలుకోవు. చచ్చిన జీవకణాలు అలాగే వుంటాయీ, పిచ్చి పిచ్చిలాగే వుంటుంది. "మందు ఇవ్వకూడదా?" అని అడుగుతారేమో: మందుకి నెత్తురులోకలిసి, మెదడులో ఆ మూలకివెళ్ళి ఆ చచ్చిన జీవకణాల్ని మట్టుకే హరింపజేసి మిగిలిన కణాలు వేటికీహాని చెయ్యకుండా వచ్చేయగల ప్రత్యేకశక్తులులేవు. కనక మామూలు పద్ధతులు పనికిరావు.

అప్పుడు సామాన్యంగా డాక్టర్లు జ్వరం తెప్పించడానికి చూస్తారు. మలేరియా క్రిముల్ని ఆ పిచ్చివారి నెతురులోకి ఎక్కించుతారు. ఈ క్రిములకీ శరీరపుశక్తులకీ జరిగే యుద్ధములో శరీరపు జీవకణాలకి పరిశ్రమ హెచ్చుతుంది. అంటే జ్వరము వస్తుందన్నమాట. హెచ్చినశక్తితో మెదడులో ఆ మూలనున్న సజీవకణాలు, నిర్జీవకణాల్ని హరింపజేయగలుగుతాయి. తరువాత అలవాటూ అనుభవమూ చేరుతూంటే మెదడులోనే ఆచోట రికామీగా ఉన్న జీవకణాలు చచ్చిపోయిన జీవకణాల పనిలో తరిఫీదుపొంది కాలక్రమాన్ని వాటి డ్యూటీని తాము చెయ్యగలుగుతాయి. అంటే పిచ్చికుదురుతుందన్నమాట.

స్త్రీల గర్భాశయమునకు సంబంధించిన చిన్న గొట్టముల వ్యాధులు కూడా మామూలు మందుల నివారణకి అందవు. అప్పుడు వారికి పాలు కండరాలలోనికి ఇంజెక్షను ఇవ్వడముకద్దు నెత్తురులోకిగాని పాలవంటి పరకీయ మాంసకృత్తు ప్రవేశించిందా, నిరోధకశక్తులు తిరగబడతాయీ, జీవకణాల పరిశ్రమ హెచ్చి జ్వరము వస్తుందీ, ఈ సందడిలో ఆ మూలనున్న వ్యాధిని ఆ చుట్టుపట్లనున్న జీవకణాలు నిర్మూలిస్తాయి. ★



# శ్రావణ సం

"ఇంకా బయలుదేర లేదేమే కమలా! ఈపాటికి నువ్వు తయారుగావుంటావనుకుంటూ వొచ్చాను" అని వీధిలోనుంచే విమల కేకలు పెట్టుకుంటూ లోపలికి వచ్చింది

గదిలో కిటికీదగ్గర నుంచోని శూన్యంలోకి చూస్తున్న కమల ఉలిక్కిపడింది "బాగానే వుంది నీ సంగతి! ఎవరైనా చూస్తే నవ్విపోతారు. శ్రావణ మంగళవారప్పూట ఇదేం అవతారమే కమలా!" అంటూ దగ్గరికి వెళ్లి కమల ముఖం చూసి నివ్వెరపోయింది విమల దట్టంగా మబ్బులు కమ్మిన శ్రావణ సంధ్యాకాశంలాగా వుంది కమల ముఖం

"నేను రానమ్మా విమలా! నువ్వు వెళ్లిరా పేరంటానికి ఇంటికి వెళ్లేటప్పుడు నాకు కావలిసిన శనగలు తెచ్చిపెట్టటం మరిచిపోకేం" అంది కమల లేని ఉత్సాహాన్ని కళ్ళలో మెరిపిస్తూ.

"ఇదేం విడ్డూరమే కమలా! రానంటావేమిటే? పసుపుకుంకానికి పది మైళ్ళు దూరమైనా నడిచి వెళ్లలన్నారు పెద్దలు" అంది బతిమాలుతూ విమల ఆ పిల్ల వయసు చిన్నదైనా మాటలు పెద్దవి. మాంగళ్యాన్ని గురించి అంతా తెలిసిన పెద్ద ముత్తయిదువులాగా పన్నెండేండ్ల విమల మాట్లాడుతోంది తీర్చిదిద్దిన తిలకం నుదుట మెరుస్తోంది అంకురించే లేత యౌవనపు సోయగంతో శరీరం నవనవలాడుతోంది చేతులో పట్టు చేతిరుమాలని విలాసంగా గిరగిర తిప్పుతూ "అయితే నువ్వు రానట్లేనా?" అంది విమల "ఊఁహూఁ" అని తలతిప్పింది కమల "చూసుకో! నీకొక్క శనగగింజయినా పెడతానేమో!" అని చూపుడు వేలుతో బెదిరిస్తూ తూనీగలాగా దూసుకుపోయింది విమల ఆ పిల్లని చూస్తుంటే శిలలమీద గంతులేస్తూ గలగలపరిగెత్తే సెలయేరు గుర్తొస్తుంది, అవును మరి అదృష్టవంతురాలు విమల పుట్టిన యింట్లోనూ మెట్టిన యింట్లోనూ ధనధాన్యాలు మూలుగుతూ వుంటయ్. మొన్నీ మధ్యనే తొలిదంత

"అమరేంద్ర"

పూలుదూరంగా కదులుతున్నయ్. పొద్దున కురిసిన వాననీళ్ళని గుంటల్లోంచి ఒకళ్ళమీద ఒకళ్ళు చల్లుకుంటూ వీధుల్లో అల్లరిపిల్లలు గోల్లుమంటున్నారు. పేరంటాలకి బయలుదేరిన బుల్లి ముత్తయిదువుల కొత్తపట్టెలమీద వాననీళ్ళపన్నీరు చల్లుతామని బెదిరిస్తున్నారు. కట్టుకున్న బట్టలు ఎక్కడ పాడైపోతయ్యో అని జర్రున కాళ్ళు జారుతున్నా బురదలో చకచకా నడుస్తున్నారు పిల్ల పేరంటాళ్ళు. ఊరిబైట కొత్తగా సన్నాయి నేర్చుకుంటున్న మంగలి రంగడి పాటకి గోతుల్లో కప్పలు గుర్రు గుర్రుమంటూ తాళం వేస్తున్నయ్.

కమలకి వేమీ కనిపించటం లేదు. అల్లుకుంటున్న మబ్బులనీడలకేసి చూస్తూ నిలబడింది. అంతులేని శూన్యంలో కమల ఆలోచనలు దారం తెగిన గాలిపటాలకి మల్లే ఎగిరిపోతున్నయ్. ఎదుట కనిపించే శూన్యమంతటిలోనూ కమలకి తండ్రి రూపమే కనిపిస్తున్నది. తండ్రి గుర్తుకి రాగానే నెత్తురంతా గడ్డ కట్టుకుపోతున్నట్లుగా వుంది. తండ్రికి చాలీచాలని జీతం. గంపెడు సంసారం. ఒక్కనాడయినా అది లేదు, ఇది లేదు అనుకుని ఎరగడు. అప్పుచేసి అయినా సరే పప్పన్నం తినాలని తండ్రి సిద్ధాంతం. ఇంట్లో అందరివీ భారిచేతులే. ఒకప్పుడు సిరిసంపదలతో తూగిన కుటుంబం కావటంవల్ల స్థితి చితికిపోయినా కూడా వీసంకూడా తగ్గలేదు. ఎంత చెడినా ఇంగువకట్టినగుడ్డకి వాసన పోతుందా? పుట్టిపెరిగినవాడు కావటం చేత పలుకుబడికీ పరువు మర్యాదలకీ కొరత లేదు. పరిస్థితులు తారుమారయినా నిజాయితీ మనిషి కనక తండ్రి అడిగితే ఎవరూ లేదనేవాళ్ళు కారు. తండ్రి వున్నన్నాళ్ళు హాయిగా కాలం గడిచిపోతుంటే అంతా సుఖపడ్డారు. కాని ఈ వైభవమంతా ఎల్లా నడుస్తున్నదో ఒక్కరూ ఆలోచించలేదు. తమ సంసారం అప్పులనే నిప్పులకొండ మీద సమస్తసౌఖ్యాలూ అనుభవిస్తున్నదనీ, ఎప్పటికైనా ముప్పు తప్పదనీ ఎవ్వరూ తెలుసుకోలేకపోయారు. నిండా మునిగిన మనిషికి చలివుండదు. అప్పుల్లో మునిగినవాడికి ముందుచూపూ, జంకూ అసలే వుండవు. సుడిగుండంలో చిక్కిన మనిషి అడుక్కి పోయేదాకా ఆగడు. అప్పుల్లో మునిగిన మనిషి అంతా ఆరిపోయేదాకా ఆగడు. తండ్రి వున్నన్నాళ్ళు రోజులు హాయిగానే వెళ్ళిపోయినయ్.

అయినా ఆదాయం తరిగిపోవటంతో పాటు సంసారం పెరిగింది. పెద్దకొడుకు చదువు, కమల పెళ్ళి, ఇంట్లో హద్దూపద్దూ లేని ఖర్చు ఈ సమస్యలతో తండ్రి ఉక్కిరిబిక్కిరయిపోయాడు. పైకి నవ్వుతూనే వున్నా లోలోపల కుమిలిపోయాడు. బాధలతో ఆయనమనస్సు తూట్లు పడిపోయి వుంటుంది. కాని ఆయన నిండుకుండలాగా పైకి తొణక్కుండా పెదిమలమీద చిరునవ్వుని వదిలేవాడు కాడు.

ఆయన చేతిమీదుగా పెద్దమ్మాయి నిర్మల పెళ్ళి ఒక్కటే జరిగింది. కాళ్ళరిగేట్లు తిరిగి సంబంధం వెతికాడు. చాప చెడినా చదరలాగా మిగిలివున్న అయిదెకరాల్లో రెండెకరాలు తెగనమ్మి పెళ్ళి చేశాడు. కాని పెళ్ళయిన ఏడాదికే నిర్మల వైధవ్యభారంతో కుంగిపోయింది. ఈ కబురు వినగానే నాన్న ముఖం మారిపోయింది. ఏదో శూన్యంగా చూస్తూ ఎంత పిలిచినా పలికేవాడు కాడు. ఒకరోజు పొద్దున కాలవలో ఆయన శవం కొట్టుకు పోతూవుంటం చూసేసరికి అందరికీ మతిపోయినట్లయింది.

గంపెడు సంసారాన్ని నట్టేట్లో వొదిలి తండ్రి వెళ్ళిపోయాడు. అంతా రెక్కలు రాని పసికూనలే. ఎటుచూసినా అప్పులే. పొలమే కాక ఉన్నదంతా తెగనమ్మినా బైటపడతామనే ఆశలేదు. పుట్టెడు దిగులుతో అంతా కొట్టుకుంటున్నారు.

తనమీద ఆయనకి ఎంత ఆపేక్ష? తనకు పెళ్ళిచెయ్యాలని ఎంత తహతహపడ్డాడో? ఎక్కడా వరుడు దొరకలేదని ఎంత కుంగిపోయాడో? తన ముఖంకేసి చూడటానికే ఎంతో బాధపడేవాడు. తనకి పెద్దచదువు చెప్పించాలనీ, మంచి సంబంధం తేవాలనీ తండ్రి ఎన్ని కలలు కన్నాడో! కాని చక్రం తిరిగింది. చుక్క ఎదురయింది.

తల్లిని పలకరించటానికి వచ్చిపోయే అమ్మలక్కలందరూ "కమల పెళ్ళయినా చేశాడు కాదు" అంటుంటే కమల కంపించిపోతుంది. తను తండ్రి గుండెలమీద ఎంత బరువైన బాధ పెట్టిందో? అకస్మికంగా తండ్రి కాలవలోపడి ప్రాణం తీసుకోటానికి తను కారణమేమో? ఈ వేదనతో కమల కుమిలిపోతోంది. ఏదో పెద్ద తప్పిదం చేసినట్లు మనస్సు అస్తమానం పొడుస్తూ వుంటుంది. నలుగురి ముఖమూ చూడటానికి కూడా మనసొప్పటంలేదు. తండ్రి మరణానికి కారణమైన తను సిగ్గులేక మొండిగా బతి

(56—వ పేజీ చూడండి)




# త్రాగుబోతు

శ్రీమతి సూర్యదేవర పరంజ్యోతి

తప్పత్రాగిన త్రాగుబోతూ
ప్రక్కవూరికి నడిచి పోవుచు
దారిలోని దిగుడు భావిని
చూచి ఆగాడు.

"భావిలోని నీటినంతను
'సార' చేయుముస్వామి నీవా"
అనుచు దేవుని కోరియాతడు
అపుడు వెళ్లాడు.

త్రాగుబోతూ మాటలన్నీ
తానువిన్నా దైవమనుకొనె:
"ఎంత త్రాగే మనిషి అయినా
అంతసారా త్రాగ గలడా ?"

త్రాగుబోతూ మాటలన్నీ
తాను నమ్మిన దైవమపుడూ
భావిలోని నీటినంతను
సార చేశాడు.

మారు వేషము వేసి దైవము
భావి ప్రక్కనె వేచియుండగ
త్రాగుబోతూ తిరిగివస్తూ
భావిలోనికి తొంగి చూశాడు.

"కల్లువాసన వేయుచున్నది
నీరు అంతయు సారఅయినది"
సంతసించీ తాగుబోతూ
భావిలో దిగెను.

తప్పత్రాగీ బయట కొచ్చి
దారిబట్టీ పోవుచుండగ
మారువేషపు దైవమపుడూ
"త్రాగుబోతా! త్రాగుబోతా!"
అనుచు పిలిచాడు.

"భావిలోని సారనంతయు
త్రాగుదామను కుంటివే ?
నీవు కోరిన నీరు అంతయు
సారా అయింది."

త్రాగుబోతూ జవాబిచ్చెను:
"త్రాగుబోతూ మాటలెట్టులు
నమ్మినావో పిచ్చి స్వామీ!
భావిలోపలి కల్లుఅంతా
త్రాగి ఇంకా బ్రతకగలనా?
త్రాగుబోతుల మాట లెపుడూ
నమ్మకయ్యా ఇంక స్వామీ!" ★

# బడిదొంగను పట్టిన బ్రహ్మ

మా క్లాసులో ప్రతిరోజూ ఎవరిదో ఒకరిది, పలకో పుస్తకమో, ఏదో ఒకటి కనపడకుండా పోతూండేది. ఒక రోజయితే ఏమో అనుకోవచ్చును గానీ, ప్రతిరోజూ ఎవరిదో ఒకటి ఇలా పోతూంటే ఏమనుకోవాలి? ... ఇంటి దొంగను ఈశ్వరుడైనా పట్టలేడన్నారు కానీ, బడిదొంగను బ్రహ్మ దేవుడైనా పట్టలేడని పించింది.

గోపీ తెలుగు వాచకం పోగొట్టుకున్నందుకు వాళ్లనాన్న, పాపం, వాణ్ణి సున్నంలోకి ఎముక మిగలకుండా, కొట్టాడు. దొంగిలించిన వాడెక్కడ హాయిగా ఉన్నాడో కానీ, ఆ దొంగకు పడాల్సిన దెబ్బలన్నీ గోపీకే పడ్డాయి. వొళ్లంతా వాచిపోయినందు చేత, పాపం, మా ఎదుట తలఎత్తుకొని తిరగటానికి సిగ్గుపడి కామోసు, ఆ వేళంతా బడికి రాలేదు గోపీ. సాయంత్రం మాతో ఆడుకొనేందుకుకూడా రాలేదు.

ఇంతకీ దొంగ ఎవరు? అతడి దొంగతనం ఇంకా ఎన్నాళ్లు ఇలా సాగుతుంది? – ఇవే మాలో ప్రతి ఒక్కర్నీ పట్టుకు వేధిస్తున్న ప్రశ్నలు. దొంగ ఎవడో తెలియకపోయినా, మేము మాత్రం అతనికి చాలా భయపడి ఎంతో జాగ్రత్తలో ఉండేవాళ్లం.

"నాకు కాస్త టైం ఇవ్వండ్రా" ఆ దొంగ వెధవను పట్టివ్వకపోతే నన్ను మీరు పేరెట్టి పిలవండి" అని అప్పుడప్పుడూ సోమూ అంటూవుండేవాడు వాడి బడాయి కబుర్లకి మేమందరమూ పొట్ట చెక్కలయ్యేటట్లు నవ్వుకొనేవాళ్లం. నిజానికి వయస్సులో వాడు మా అందరికన్నా చిన్నవాడే కానీ అప్పుడప్పుడూ చాలా తెలివిగా మాట్లాడేవాడు. "పిట్ట కొంచెము-కూత ఘనము" అన్నంటుండేవి వాడిమాటలు.

నేను ఎంతో జాగ్రతగా వుంటున్నా ఆవేళ నా లెక్కల పుస్తకం పోయింది. నిజంగా నాకావేళ ఏడ్పు వచ్చేసింది. నా లెక్కల

**శ్రీ జి. వి. జి. కృష్ణ**

పుస్తకం పోయిందని నేను తికమకలు పడుతున్నప్పుడు, క్లాసు పిల్లలందరం ఎప్పటిలాగానే కాస్సేపు ఒకరిమొహాలు ఒకరు తెల్లబోయి చూసుకున్నాము. ఇంతలోకే సోమూవచ్చి "ఏంట్రా మళ్ళీ ఈవేళ ఎవరిదైనా పుస్తకం పోయిందా ఏంటీ?" అని అమాయకంగా ప్రశ్నించాడు. అతని ప్రశ్నకు ఎవ్వరూ జవాబు చెప్పినట్లు లేదు.

"ఆదొంగ వెధవ ఇంకా ఎన్నాళ్లని ఇలా దొంగతనం చేస్తూంటాడులే... ఇక కొద్ది రోజుల్లోనే దొరికిపోడూ" అని తన మామూలు ధోరణిలో అన్నాడు.

ఏం చేయటానికీ తోచక, నేను నేరుగా మా చలమయ్య మాస్టారు దగ్గరికెళ్లి ఈసంగతిని చెప్పేశాను. ఆయన శ్రద్ధతో అంతావిని "అది కాదురా ... ఇన్నాళ్లుగా అలా దొంగతనాలు జరుగుతూ వుంటే మాతో ఎవరితోనైనా, ఒక్కనాడైనా చెప్పకూడదట్రా?" అని కోపంచేసే అన్నారు.

సోమూ అందుకొని "అదికాదు సార్!...ఆదొంగను మేమే ఎన్నడైనా పట్టకపోతామా అని ఇన్నాళ్లుగా మీతో చెప్పలేదుసార్" అని మధ్య మధ్య గొంతు సవరించుకుంటూ అన్నాడు.

"ఏడ్చారు ... మీ రేమిట్రా పట్టేది మీ మొహాలు" అని కుర్చీని లాక్కొని కూర్చున్నాడు మేస్టారు. కాస్సేపు దీర్ఘంగా ఏదో ఆలోచించి "మీ తరగతిలోని పిల్లలందర్నీ ఇక్కడికి పిలుచుకొని రండ్రా" అన్నాడు.

నేనూ వాసూ వెళ్ళి అందర్నీ పిలుచుకొని వచ్చి మా మేస్టారెదుట నిలబెట్టాము. బంట్రోతును పిలిపించి వాడిచేత ఒక చీపురుకట్టను తెప్పించాడు మేస్టారు. ఆ చీపురు కట్టనించి ఒక ముప్పై పుల్లలను ఏరి, ప్రతి పుల్లా సరిగ్గా ఆరు అంగుళాలు ఉండేలాగున స్కేలుతో కొలిచి

తుంచాడు. ఆతుంచిన పుల్లలను రెండు చేతులతో పట్టుకొని కాస్సేపు కళ్లు మూసుకున్నాడు. కళ్లు తెరిచాక మా అందరికీ తలా ఒక్కొక్క పుల్ల ఇస్తూ "ఇప్పుడు నేను చీపురు పుల్లలను మంత్రించి ఇస్తున్నాను. మీ కిచ్చిన పుల్లను మీరందరూ మీమీ చేతుల్లో భద్రంగా పట్టుకొని, ఒక్కొక్కరుగా వెళ్లి మన బడితోటలోని సరస్వతి విగ్రహాన్ని ఆ పుల్లతో తాకి, మళ్లీ ఆ పుల్లను తెచ్చి నాకు చూపాలి. ఎవడైతే దొంగతనం చేశాడో వాడి చేతిలోని పుల్ల మాత్రం, ఒక అంగుళం పెరిగి పోతుంది. దొంగతనం చేయని వాళ్ల చేతిలో పుల్లలు అలాగే ఆరు అంగుళాలు వుంటాయి. దీంతో దొంగ ఎవడో బయట పడిపోతాడు. ఊఁ... ఒక్కొక్క రొక్కొక్కరుగా వెళ్లి రండి" అన్నాడు.

మేమందరమూ, చలమయ్య మేస్టరుగారు చెప్పినట్లుగా, మా కిచ్చిన పుల్లను చేతబట్టి ఒక్కొక్క రొక్కొక్కరుగా తోటలో కెళ్లి, సరస్వతీదేవి విగ్రహాన్ని ఆపుల్లతో తాకి, పుల్లలను వరుసగా తెచ్చి, మేష్టరుగారికి చూపుతూ వచ్చాం. మేము తెచ్చిఇచ్చిన ప్రతి పుల్లను స్కేలుపెట్టి కొలిచి చూసుకునేవాడు మేష్టారు.

సోమూ కూడా మేస్టరు దగ్గరకు వచ్చి చేతిలోని పుల్లను చూపించాక "దొరికాడురా దొంగ" అని పొలికేకపెట్టి వాడి చేతిని గట్టిగా పట్టుకున్నాడు మా చలమయ్య మేస్టారు.

మేమందరమూ అదిరి పడ్డాం. సోమూ గడగడ వణికిపోతున్నాడు. వాడి చేతిలోని పుల్లను లాక్కొని మాకందరికీ చూపిస్తూ "ఒరేయ్; వినండిరా ! వీడు పుల్ల పొడుగు ఎక్కడ పెరిగిపోయిందో నని భయపడిపోయి, సరిగ్గా ఒక అంగుళం పుల్ల తుంచేశాడురా !! నిజగా వీడే దొంగఅయి వుండకపోతే వీడి కింత భయం ఎందుకు పుట్టాలి? ఏంరా; సోమూయ్! పుల్లను తుంచేశావు కదూ? చెప్పు—నిజం చెప్పు!" అని వాడిమీద గుడ్లు వురిమారు మేస్టరు.

సోమూ ఏడుపు మొదలు పెట్టాడు. "వెధవా ఎవరు కొట్టారురా నిన్ను — అలా ఉత్తి పుణ్యానికి ఏడుస్తావేం ? దొంగ వెధవా!...నిజం చెప్పు...నువ్వేగా దొంగవు ... ఊఁ ... నోరు తెరిచి చెప్పు...మంచి మాటలతో చెప్పక పోతే, బుర్ర గొరిగి గాడిదమీద ఊరేగిస్తా ఏమనుకున్నావో... ఊఁ...చెప్పు...నిన్నేరా అడిగేది" అని మరీ గదమాయించాడు.

ఇక గత్యంతరం లేక అవమానంతో తలఊపాడు సోమూ



తానే దొంగ అని ఒప్పుకొంటూ.

"దొంగిలించిన పుస్తకాలన్నింటినీ ఏం చేశావ్? మేస్టరు గర్జించాడు. "ఇంట్లో వున్నాయిసార్" అని ఏడుస్తూనే జవాబిచ్చాడు సోమూ.

"ఊహుం ...వెధవ్వ-వేలెడంత లేవు, ఇప్పట్నించే ఇవేం పాడు బుద్ధులురా నీకు ? నువ్వు ఎవరెవరి వస్తువులు ఏవేవి దొంగలించావో వాటి నన్నిటినీ ఇపుడు మీ ఇంటికి వెళ్ళి తెచ్చి ఎవళ్లవి వాళ్లకు అప్పగించెయ్ ఏం ? తెలిసిందా? లేకపోతే ఏం చేస్తానో నా సంగతి తెలుసుగా? ...ఏమిటీ !" అని అరిచాడు.

"అలాగే సండీ" అని మెల్లిగా సోమూ మూల్గాడు.

"ఊం ... ఇంటికి వెళ్లి వాటి నన్నిటినీ తీసుకురా" అని సోమూను పంపించాడు; వాడి వెంట నన్ను కూడా పొమ్మన్నాడు.

వాడు మా అందరి పుస్తకాలూ మాకు తెచ్చి అంద చేశాడు. పోయిన పుస్తకాలన్నీ మళ్లీ దొరికినందుకు మేమందరమూ అమితంగా సంతోషించాం. మా చల్లమయ్య మేస్టరుగారి యుక్తిని మాలో మేము తెగ మెచ్చుకొన్నాం

ఆరోజు నించీ, ఆ తరగతిలో ఎన్నడూ దొంగతనాలు జరిగేవి కావు. మేమందరమూ నిశ్చింతంగా ఉండే వాళ్లం.





# జంతుకోటిలో మానవలక్షణాలు

మానవుడికి జంతువు లంటే సహజంగా అదోరకమైన చిన్న చూపు వుంటుంది. సృష్టిలోకల్లా తానొక్కడే తెలివైనవాడనని అనుకొంటాడు. ఏదైనా బుర్ర వుపయోగించి చేయవలసిన పని అయితే, అది తానొక్కడే చేయగలడు కానీ, మరి ఏ జంతువూ చేయనే లేదని యీతని కొక గాఢమైన నమ్మకం. అంతేకాదు. తోటి మానవు డెవడైనా కొంచెం తెలివితక్కువగా వున్నట్లు కనిపిస్తే, వాణ్ణి పట్టుకొని "వట్టి మృగం" అనేస్తాడు. నిజంగా అటువంటి సమయంలో మానవుల భాష తెలిసిన మృగమేదైనా యీ మాటవింటే చాలా బాధ పడుతుంది.

గడచిన నూరు ఏళ్ల లోనూ విదేశాల్లో చాలా మంది మానసిక శాస్త్రవేత్తలు ఎన్నో పరిశోధనలు చేసి, జంతువులకు కూడా స్వతహాగా ఆలోచించే తెలివి తేటలు వున్నాయని తేల్చారు. కాకపోతే ఒక జంతువుకి వున్న తెలివితేటలు మరొక జంతువుతో పోల్చిచూస్తే ఎక్కువగానో, తక్కువగానో వున్నట్లు తోస్తాయేకానీ, ఆలోచించే శక్తి బొత్తిగా లేని జంతువులు మాత్రం చాలా తక్కువ.



కొన్ని కొన్ని జంతువుల విషయంలో పరిశోధనలు చేయబోయిన యీ శాస్త్రజ్ఞులనే ఆ జంతువులు పరిశోధించాయి! ఒక సందర్భంలో కొంత మంది మానసిక శాస్త్రవేత్తలు కలిసి ఒక చింపాంజీని (పెద్దరకంకోతి) పట్టుకొచ్చి, లోపలి శబ్దం బైటకు విన్పించని ఒక గదిలో వదిలిపెట్టి, తామందరూ గుట్టు చప్పుడు కాకుండా గది యవతలకు నడిచి వచ్చేశారు. అన్నట్లు ఆ గది నిండా పిల్లలు ఆడుకొనే ఆట వస్తువులన్నీ చెల్లా చెదురుగా పడేసి వుంచారు. లోపల ఆకోతి ఏం చేస్తుందోనని వీళ్లంతా ఆత్రంగా వున్నారు. వాళ్లలో ఒకడు కలం కాగితం తీసుకొని తలుపు కన్నంలో నుంచి చూడబోయాడు. ఆకోతి బలే గడుసుది. ఇవతల వీళ్లంతా ఏం చేస్తున్నారోనని అది కూడా ఆ కంతలోకే కన్నుపెట్టి చూస్తూ కూర్చొన్నది. కోతికి కూడా మన కున్నంత తెలివి తేటలు వున్నాయనటానికి యింతకంటే వేరే నిదర్శనం ఏం కావాలి?

మరొక పరిశోధన సందర్భంలో కొన్ని చింపాంజీలను కొందరు కాలేజీ విద్యార్థులను (విద్యార్థినులతోసహా) చిక్కుదారుల్లో వదిలిపెట్టారట. తీరాచూస్తే, చింపాంజీలే ముందుగా చిక్కు దార్లు అన్నీ తప్పించుకు బయట పడ్డాయి. వెనుకపడ్డ కాలేజీ కుర్రలను చూచి పళ్లు యికిలించాయట కూడాను.

అంతేకాదు: జంతువులకి మనుష్యులకుమల్లేనే దర్పంపోయే గుణం కూడా వుంటుందట. మానవుల్లా

గానే అవి కూడా పొరుగువాళ్లు పచ్చగావుంటే తమకంట్లో దుమ్ము పోసుకోవటం కూడా కద్దట!



సముద్రపు సింహం అని ఒక జంతువు వుత్తర అమెరికా సముద్ర తీరంలో నివసిస్తూ వుంటుంది. మన వీధి నాటకాలలో రాజులకు మల్లే యీ జంతువుకి కూడా ఆర్భాటం ఎక్కువ. పదిమంది పోగైనచోట తనూ చేరి తన తెలివితేటలు ప్రదర్శించటమంటే యీ జంతువుకు మహాయిష్టం. తను చేసే యీ వెకిలి చేష్టలు చూసే ప్రేక్షకులు, మనుషులే కావాలన్న పట్టింపు ఏమీ లేదు. అంతవరకు బ్రతికి పోయాం! లేకపోతే మనం సుఖంగా కాలక్షేపం చేద్దామని ఏ క్లబ్బుకైనా పోతే, అక్కడికి కూడా యివి తయారు అయ్యేవన్నమాటే. తనజాతివే మరికొన్ని సింహం పిల్లలను పోగుచేసుకొని వచ్చి, వాటి నన్నిటినీ బారులు బారులుగా కూర్చోపెట్టి, యీ జంతువు కుప్పిగంతులు వేస్తుంది. ఇంకొక విశేషం. ఇలా ఒక సింహం గంతులు వేస్తూ వుండటమూ, తోటిమృగాలు పదీ చుట్టూ చేరి చప్పట్లు కొట్టుతూ వుండటం గనుక మరొక పొగరుబోతు సముద్రపు సింహం కంట పడిందో - యిక చూసుకోండి— దానికి వెర్రి గంగురు లెత్తిపోతుంది. పట్టరాని వుక్రోషం వస్తుంది. అవతల అల్లరిచేస్తున్న ఆ సింహం కంటే యిది మిక్కుటంగా అరిచి గీపెట్టి, అందరి దృష్టి తనవైపుకు త్రిప్పుకొనేదాకా నానా యాతన పడుతుంది. (ఈ విషయం వ్రాస్తుంటే నాకో సంగతి జ్ఞాపకం వస్తోంది. నా చిన్నతనంలో మా అమ్మతో కలిసి నేను ఒకళ్లింటికి శ్రావణ మంగళవారం పేరంటానికి వెళ్లాను. మా అమ్మ తను కొత్తగా చేయించుకొన్న గాజుల జతలను ప్రక్కను వున్నావిడ చూసి మెచ్చుకోవటం మొదలుపెట్టింది. కొంచెం దూరంలో మరొక నల్లటి ముత్తైదువు కూర్చొని వున్నది. ఆవిడ క్రొత్తగా రత్నాల నెక్లెస్ చేయించుకొంది. తానంత గొప్ప నగ చేయించుకొని, మెడకు తగిలించుకొని వస్తే, తనను చూడక పోగా, మా మామూలు గాజులు చేయించుకొన్న మా అమ్మను పదిమందీ పొగడడం చూసి ఆమె మహా వుడికి పోయింది. గబుక్కున తన మెడలోనుంచి ఆ నెక్లెస్ వూడదీసి చేత్తో పట్టుకొని, యింత సేపూ మా అమ్మచుట్టూ ముసిరిన ముత్తైదువులను పేరు పేరునా పిలిచి, అందరికీ ఆ నగను వర్ణించి చెప్పింది. అప్పటికి కాని ఆవిడ ముఖంలో ఆ ధుమ ధుమ తీసిపోలేదు. మనుష్యుల తత్వాలే యిలా వున్నప్పుడు పాపం-ఆ జంతువును అనటం దేనికీ!)

కోతి జాతికి చెందినదే ఒరాంగుటాంగ్ అనే మరొక రకం కోతి వున్నది. ఇది స్వతహాగా శాంత స్వభావంకల జంతువు. మొన్న మొన్నటి వరకూ మానసిక తత్వశాస్త్ర వేత్తలంతా మిగిలిన అన్ని మృగాలకంటే ఒరాంగ్‌టాంగ్ కే ఎక్కువ తెలివితేటలు వున్నాయని అంటూ వుండేవారు. ఇటీవల జరిగిన కొన్ని పరిశోధనల ఫలితంగా యీ అభిప్రాయం మార్చుకోవలసి వచ్చింది - గొరిల్లా అనేది కూడా ఒక రకమైన కోతే. సినిమాలలోనూ, కథలలోనూ యీ గొరిల్లా ఎంతో దుష్టబుద్ధిగలజంతువు అని ప్రచారం జరిగింది. నిజానికి గొరిల్లా అంతగా స్నేహపాత్రమైన జంతువు మరొకటి లేదు. సామాన్యంగా గొరిల్లాలను 'జ్యూ'లలో పెట్టినప్పుడు, అవి కొన్ని రోజుల్లోనే తమకు తిండి పడేద్దివారితో సావాసం చేశేస్తాయి. అంతే కాదు; - తమకు అన్నం తెచ్చే మనిషి, మరొక మృగానికి దేనికైనా అన్నం పెట్టుతున్నట్లు కానీ, మరొక మృగాన్ని మచ్చిక చేసుకొంటున్నట్లు కానీ, చూస్తే, సవితి పొడగిట్టని యిల్లాలులాగా గగ్గోలు పెట్టేస్తాయి.

మనుష్యులలో వేరువేరు ప్రకృతులు వున్నట్లే జంతువుల్లో కూడా భిన్న ప్రవృత్తులు వుంటాయి. పిల్లి, కుక్క, - వీటిని మనిషి అంత దగ్గరకు తీసుకొంటాడా! అయినా— యజమాని అంటే వీటికి వుండవలసిన అంచనాలలో వ్యత్యాసం

(53 వ పేజీ చూడండి)

# వింత వైద్యం

కోటయ్య, సుబ్బమ్మ భార్యాభర్తలు. వీరిద్దరికీ ఒక్క నిమిషమైనా పడదు. కోటయ్య చెప్పింది సుబ్బమ్మకు నచ్చదు; సుబ్బమ్మ చెప్పింది కోటయ్య వినడు.

కోటయ్యకు రెండెకరాల మాగాని ఐదు కుంటలు మెట్ట వున్నది. ఒక చిన్న పెంకుటిల్లు, జత ఎడ్లు, బండీ, ఒక గేదె, ఒక ఆవు వున్నాయి ఏదో తిండికీ బట్టకు యిబ్బంది లేకుండా కోటయ్య రోజులు వెళ్లబుచ్చుతున్నాడు. ఈ తగవులమారి సంసారంలో, భగవంతుని దయవల్ల సంతానం లేదు.

ఉదయం లేచింది మొదలు రాత్రి పడుకోబోయేవరకు సుబ్బమ్మ కోటయ్యమీద ఏదో ఒకదానికి దెప్పి పొడుస్తూనే వుండేది. 'పక్కయింటి పాపమ్మ గొలుసు చేయించుకున్నది; వెనుకయింటి వెంకమ్మ గజ్జల పట్టెడి చేయించుకొన్నది. నా కామాత్రపు అదృష్టంకూడా నా! ఇంతకీ నా రాత!" అంటూ సుబ్బమ్మ యెప్పుడూ సణుగుతూ వుండేది.

శ్రీమతి కె. రుక్మిణమ్మ

"బ్రహ్మకైన పుట్టురిమ్మతెగులు" అన్నట్లు కోటయ్యకు వినగా వినగా సుబ్బమ్మను సాధించాలని బుద్ధి పుట్టుకొచ్చింది. "మన యెదిరింటి ఎంకయ్య భార్యను చూడు, వాడితో యెంత అనుకూలంగా వుంటుందో! ఆ పొరుగింటి పుల్లయ్య పెళ్లాం చూడు, పొలందగ్గరా, యింట్లోనూ ఆయనకు ఎంత చేదోడు వాదోడుగా వుంటుందో! నా కా మాత్రపు అదృష్టం కూడా నా! ఇంతకీ నా రాత!" అంటూ కోటయ్య ఎదురు దెప్పేవాడు. ఇద్దరూ యీ రీతిగా యితరకుటుంబాలను చూచి వుసూరు మంటూండేవాళ్లు.

వీరి యింటిప్రక్కనే ఒక ముసలి అవ్వ కాపురముండేది. ప్రతిరోజూ వీరిద్దరితగాదా అవిడకూ వినిపిస్తుండేది. అది కాకుండా సుబ్బమ్మ ప్రతిరోజూ కోటయ్య పొలానకి వెళ్లిపోయాక, పనిగట్టుకు యీ అవ్వ యింటికివచ్చి, తన అవస్థలను ఏకరువుపెట్టి ఏడ్చేది. వినగా వినగా అవ్వకు ఒక వుపాయము తట్టింది.

"ఏడవకు అమ్మాయీ, ఏడవకు! నేనొక మందు తయారుచేసి యిస్తాను ఆమందు పదిహేను రోజులపాటు ఉదయమూ సాయంత్రము పుచ్చుకొంటివా, నీ భర్తా నివు చాల అన్యోన్యంగా వుంటారు. ఈమందు మీలాగ తగవులాడే దంపతులకు యిదివరకు యిచ్చాను. వాళ్లు యిప్పుడు చిలకా గోరింకల్లా వుంటున్నారు!" అని అన్నది అవ్వ.



ఆమాట వినగానే సుబ్బమ్మ అవ్వచేతులు రెండూ పట్టుకుని 'నీ కెంతైనా పుణ్యముంటుంది; అవ్వా! ఆమందు రేపే ఆరంభించవూ ?" అంటూ ప్రాధేయపడింది.

మరునాడు వుదయము ఏడుగంటలకు సుబ్బమ్మ వచ్చింది. అవ్వ మందు తయారుచేసి యిచ్చి దానిని సేవించే విధానం చెప్పింది:—

"ఈమాత్రను నువ్వు ప్రొద్దుటే బుగ్గను వేసికొని నీమొగుడు భోజనంచేసి పొలం వెళ్లే పర్యంతం మింగకుండా అలాగేవుంచి, ఆ తరవాత మింగు. సాయంత్రము అయిదు గంటలకు మళ్లీ రెండోమాత్రని అలాగే బుగ్గను వేసికొని నీపెనిమిటి నిద్రపోయిన తరవాత మింగు." ఆమాత్ర ఒకటి నోటిలో వేసికొని సుబ్బమ్మ యింటికి వచ్చి, అన్ని పనులు మెదలకుండా చేసికొంటోంది. పొరపాటునైనా మాట్లాడితే మందు పనిచేయదేమో అన్న బెంగతో నోరువిప్పటమే లేదు.

ప్రతిరోజూ లేస్తూనే శతమానాలు పెట్టే పెళ్ళాం మెదలకుండా పనిచేసికోవడం చూస్తే కోటయ్యకు ఏమీ తోచక మతిపోయినట్లయింది. 'ఏనామన కెందుకులే' అని పొలానికి వెళ్లిపోయాడు. సాయంకాలం యింటికి వచ్చాకచూశాడు. అప్పుడూ మాట్లాడకుండా పనులు చేసుకొంటోంది సుబ్బమ్మ. తను పక్కమీద పడుకొనేవరకూ ఆమె నోరెత్తలేదు. కోటయ్యకు మనస్సు తుపాను తప్పించుకొన్నంత హాయిగా వుంది.



మేనేజరు:-ఈ ఉద్యోగం కొంచెం బాధ్యత తెలిసిన వాళ్లకితప్ప ఇవ్వం. కనక మీరు వెళ్లవచ్చు.

దరఖాస్తుపెట్టిన అభ్యర్థి:- అందుకే ఈ ఉద్యోగం అడుగుతున్నానుసార్. ఇదివరకు నేను పనిచేసిన డజను ఆఫీసుల్లోను, ఏ పొరపాటు జరిగినా బాధ్యత నాదే ననేవారు.

ఇలాగ పదిహేను రోజులూ గడిచాయి. ఈ పదిహేను రోజులూ సుబ్బమ్మ మౌనంగా వుండిపోయింది. ఆతరువాత, ఆవిడకు మౌనంగా వుండటం అలవాటు అయిపోయింది.

భార్యలోని ఈ మార్పుకు కోటయ్య చాలా ఆశ్చర్యపడ్డాడు. ఒకరోజున భోంచేస్తూ కోటయ్య భార్యను చూచి "ఏమిటి విశేషం? యింత మంచిదానివి అయినావేం?" అని హెచ్చరించాడు. మజ్జిగ వడ్డిస్తున్న సుబ్బమ్మ "అవ్వగారిచ్చిన మందు మహాత్యం" అనిచెప్పి చిఱునవ్వు విసిరింది. ★




# డాన్ క్విక్సెట్

## పూర్వ కథ

లామంచా అనే గ్రామానికిచెందిన డాన్ క్విక్ సెట్ అనే వెర్రి వెంగళప్ప ఒకడు తనుకూడా ఒకవీరుడు (నైట్) గా పేరుపొందాలని వుబలాటపడి, 'రోజినాంటే' అనే ఒక కుంటిగుర్రాన్ని ఎక్కి బయలుదేరాడు. ఒకానొక స్త్రీమూర్తిని ఎంచుకొని ఆమెకుతానే 'డల్ సీనియా' అనేపేరు పెట్టుకొన్నాడు. ఆమెమన్నన సంపాదించటం కోసమే తాను ధర్మరక్షణమనే కఠోరదీక్ష స్వీకరించానని నమ్మాడు.

ఏవేవో వెర్రివెర్రి ఆశలుచూపి శాంకోపాంజా అనే ఒక అమాయకపు కూలీని తన బంటుగా చేసుకొన్నాడు. వాడు 'డాపుల్' అనే ఒక గాడిదనెక్కి యీయన వెనకాలే బయలుదేరాడు. ఒకటి రెండు చోట్ల డాన్ క్విక్ సెట్ ఏవేవో సాహసకార్యాల చేయబోయాడు. ప్రతిసారి చావుదెబ్బలు తిన్నాడు.

ప్రథమ జైత్రౌనంతరం యింటికి తిరిగివచ్చిన డాన్ క్విక్ సెట్ గారికి శాంసన్ అనే కాలేజి కుర్రాడితో పరిచయమైంది. ఆ కుర్రాడు యీయననుగురించి పత్రికలలో చదివానని చెప్పి, యీయనతో మంచిచేసుకొన్నాడు. డాన్ క్విక్ సెట్ గారు వొళ్లు బాగా నయమయ్యాక మళ్ళీ వీరవిహారాలకు బయలుదేరాడు. డల్ సీనియా రాకుమారిని కలుసుకొందామని 'టొబోసో'కు వెళ్లితే అక్కడొక శృంగభంగమైంది. అక్కడనుంచివస్తూ పగటి భాగవతులతో లేనిపోని కయ్యం తెచ్చుకొన్నాడు. పగటి భాగవతుల చేతుల్లో దెబ్బలుతినకుండా శాంకో పాంజా ఏలాగో తప్పించాడు. మళ్ళీ యిద్దరూ కలిసి ముందుకు ప్రయాణమై వెళ్లారు—

## 12

ఆరాత్రికి శాంకో పాంజా, డాన్ క్విక్ సెట్ యిద్దరూ ఒక చిట్టడవిలో విశ్రమించారు. వీళ్లు యిద్దరూ కబుర్లాడుకొని పడుకొన్నాక ఆట్టేసేపు కాకముందే, డాన్ క్విక్ సెట్ గారికి మెళుకువ వచ్చేసింది. ఆయన పడుకొన్న చెట్టుకు కొద్ది దూరంలో ఏవేవో చప్పుళ్లు అయినాయి. వాటితో యీయన అదిరిపడిలేచి కూర్చొన్నాడు. ఆ శబ్దాలు వినవచ్చిన వైపుకే చెవి ఒగ్గి పరీక్షగా విన్నాడు; కళ్లు పగలతీసుకు చూశాడు.

ఆచీకట్లో చెట్లమధ్యను గుర్రాలెక్కిన మనుష్యులు యిద్దరు కదులుతున్న చప్పుడు అయింది. డాన్ క్విక్ సెట్ గారు వొళ్లంతా కళ్లు చేసుకు చూశాడు. ఆ ఆగంతకులలో ఒకడు గుర్రం మీద నుంచి దిగి "గుర్రం దిగు నేస్తం. ఇక్కడ కాసేపు విశ్రమిద్దాం, మన గుర్రాలను మేతకు వదిలేద్దాం." అంటూ రెండోవాడికి సూచనచేశాడు. ఆవాక్యం పూర్తిఅయ్యీ కాకముందే, గడ్డిమీద వెల్లకితలా పడుకొన్నాడు. మరి ఆవ్యక్తి ఎవరో ఏమోకానీ, ఆయన అలా నేలమీద నడుము వాల్చినప్పుడు వుక్కు కవచం ఖంగున మ్రోగింది.

అప్పుడే అనుమానం తగిలింది డాన్ క్విక్ సెట్ గారికి,—యీ ఆగంతకుడుకూడా తన మాదిరిగానే ఒక వీరుడై వుండాలని. అందుకని గురకలు పెట్టి నిద్రపోతున్న శాంకో పాంజను తట్టి కొట్టి నిద్దురలేపి కూర్చోబెట్టి యిలా ఎవరో వచ్చారనీ, వారెవరో వీరుల్లా వున్నారనీ చెప్పాడు. వీళ్ళిద్దరూ యీమాటలు మాట్లాడుకొంటూ వుండగా, అవతల వ్యక్తి ఏదో వాయిద్యాన్ని పైకితీసి తీగెలుమీటి శృతులు సవరించాడు. శృతులన్నీ సరిగా కుదిరాక, గొంతెత్తి బిగ్గరగా ప్రేమగీతాలు పాడాడు. పాటతో పాటు వాయిద్యం వాయించాడు. ఒకటి తరువాత మరొకటిగా పది ప్రేమగీతాలు ఆలాపించి ఆలాపించి, విలాప ధోరణిలో "హా! దేవతా స్వరూపిణీ; ఓ 'కసిల్ డియా—డి—వాన్ డాలియా' కన్యా! ఎంత కాలమని నీకై యీరీతిని నేను కృశించి నశించిపోగలను? 'లామంచా' యందలి వీరులందరిచేతను నిన్నుమించిన సౌందర్యవతి లేదని ఒప్పించివున్నాను కదా! అయినను నీకు నాపై కరుణ రాదుగదా! ఇంకా ఎంతకాలం నన్ను యిలా దూరంచేసి హింసి

అనువాదం: శ్రీ విశ్వాత్ముల నరసింహమూర్తి

స్తావు!" అంటూ ప్రకాశంగా స్వగతం పలుక ప్రారంభించాడు.

అవతల ఆ వీరుడు "లామంచా' వీరులందరి చేతనూ ఒప్పించానే" అని అంటూవుంటే డాన్ క్విక్ సెట్ గారి వొళ్లు కోపంతో వుడుకెక్కిపోయింది. శాంకో పాంజా చెవికిఇంకా దగ్గరగా జరిగి "ఎవరీ పదరుబోతు! 'లామంచా' వీరులందరినీ ఓడించితినని ప్రగల్భములు పలుకుచున్నాడేమి? ఈ భీకరానన వీరశూరాగ్రేసరుడు డాన్ క్విక్ సెట్ గారు 'లామంచా' గ్రామమునకు చెందినవారు కాదనియా యీతని తాత్పర్యము? నా బొందిలో ప్రాణమున్నంతవరకును డల్సీనియా రాకుమారినిమించిన అందెగత్తె వేరెందునూ వుండరాదని చాటిచెప్పుటయేకదా నా పరమ ధర్మము. అట్టిచో యీ ముష్కరాధముడెవ్వడో యిందుచేరి 'కసిల్డియా—డి—వాన్డాలియా' అను నెవ్వతెయో కలదని, దానినిమించిన అందగత్తె మరెవ్వరూ లేదని ప్రగల్భము లాడుచున్నాడేమీ? ఆ పేరుకలది మానవియో, మ్రాకోకూడ నే నెరుగనైతినే!" అంటూ అంగలార్చాడు.

వీళ్లనుకొనేమాటలు అవతల ఆవీరుడికి విని పించినట్లున్నాయి. "ఎవరక్కడ? పీడితమానవులా? సుఖ సంతుష్టులా?" అంటూ అదిలించాడు.

"మేము పీడితమానవులమే" అంటూ డాన్ క్విక్ సెట్ గారు సమాధానమిచ్చాడు.

"అట్లయితే యిటురండి." అంటూ అవతలి వీరుడు వీళ్లను ఆహ్వానించాడు.

కన్ను పొడుచుకొన్నా కానరాని ఆ చీకట్లోనే డాన్ క్విక్ సెట్, శాంకో పాంజా తడుముకొంటూ తడుముకొంటూ ఆ వీరుడున్నచోటికి పోయారు. మనుష్యులైతే కనుపించడంలేదుకానీ, అలికిడినిబట్టి ఎవరు ఎక్కడవున్నదీ గుర్తులుపెట్టుకొన్నారు. తన లాటి వీరుడే ఒకడు అర్ధరాత్రివేళ అకస్మాత్తుగా తారసిల్లినందుకు డాన్ క్విక్ సెట్ గారు వుప్పొంగిపోయారు. చేతులుజాపి ఆయనను కౌగలించుకొని, కరస్పర్శాది కాలన్నీ చేసేశాడు. ఇద్దరూ ఆ చెట్లగుబురుల్లో చతికలబడి లోకాభిరామాయణం మొదలుపెట్టారు.

(ప్రస్తుతానికి ఆ వీరుడికి అడవి వీరుడన్న పేరు పెట్టుదాం-) ఆ అడవివీరుడు వుండివుండి ఒక్కమాట అన్నాడు. ఆ మాటతో డాన్ క్విక్ సెట్ గారు నిప్పు తొక్కిన కోతికి మల్లే గంతులేశాడు. అడవివీరుడు తన ప్రతాపాన్ని గురించి చెప్పుకొనే సందర్భంలో 'ఆ వీరుణ్ణి ఓడించాను, యీ వీరుణ్ణి ఓడించాను' అంటూ, పేరు మోసిన ఆ లామంచావీరుడు డాన్ క్విక్ సెట్ గారిని సైతం హతమార్చేశానని అనేశాడు. డాన్ క్విక్ సెట్ అంతటి వీరుడిచేత కసిల్డియా - డి - వాన్డాలియా కన్య డల్సినియా రాకుమారిని మించిన అందగత్తె అని ఒప్పించాననికూడా చెప్పాడు. ఎంతటి సాహసం!

ఇకఅంతటితో ఆ అడవివీరుణ్ణి ధోరణి కట్టిపెట్టమని "అయ్యా! ఓ వీరుడా, 'లామంచా' గ్రామానికి చెందిన ప్రఖ్యాతవీరుడను, భీకరానన బిరుదాంకితుడను అయిన ఆ డాన్ క్విక్ సెట్ నేనే. ఇంతకుముందెన్నడుకానీ నేను నీతో యుద్ధము చేసి యుండలేదు. లోగడనే నీవు జయించితినని చెప్పుచున్న ఆ డాన్ క్విక్ సెట్ ఎవడో నా పేరుపెట్టుకొని నిను మోసగించి యుండవచ్చును. ఆ డల్సీనియా రాకుమార్తెను మించిన అందగత్తె మరొకతకలదని నేను యింతకుముందు ఎన్నడును ఒప్పుకొని యుండలేదు; యిప్పుడు ఒప్పుకొనుటలేదు; యికముందు ఎన్నటికినీ ఒప్పుకోబోవుటలేదు. ఈ యంశముపై నీకు అంత పట్టుదలగా యున్నచో రేపు ప్రాతఃకాలమే మనమిరువురము కలహించెదముగాక. అందు నీవు జయించితివేని, నీవనిన ప్రకారమే ఆ డల్సీనియా రాకుమారికంటెను నీ 'కసిల్డియా - డి - వాన్డాలియా' కన్యయే అందగత్తెయని నేను ఒప్పుకొందును. నేనే నిన్ను జయించినచో నీ 'కసిల్డియా' కన్యనుగూర్చిన అతిశయోక్తులను వుపసంహారించుకొని, నా శరణు వేడవలయును." అంటూ డాన్క్విక్ సెట్ గారు సవాలు చేశాడు. ఆ అడివివీరుడుకూడా 'సై' అంటే 'సై' అన్నాడు. రేపుప్రొద్దున సూర్యోదయం కాగానే కత్తి పట్టుకొందామని యిద్దరూ నిర్ణయించుకొని అప్పటికి మాత్రం మామూలుగా కబుర్లు కానిస్తున్నారు.

ఇక్కడ యీ వీరులు యిద్దరు యీ వరసను మాటలలో క్రిందామీదా పడుతూవుంటే, అక్కడ శాంకో పాంజాగాడికి, ఆ అడివి వీరుడి వెంటవచ్చిన బంటుకు ఆ కొద్దిక్షణాలలోనే విపరీతమైన చనువు ఏర్పడిపోయింది వాళ్ళకు తోచినమాటలు వాళ్ళు

ఏవేవో చెప్పుకొంటూ యిద్దరూ తమ యజమానులకు కొద్ది దూరంలో పడుకొన్నారు. ఎప్పుడు పట్టిందో, యిద్దరికీ ఒక్కసారిగా నిద్దురపట్టేసింది.

తూర్పున తెల్లరేఖలు ఆడుతుండగా అందరి కన్నాముందు శాంకో పాంజాగాడికే మెళుకువ వచ్చింది. ఆ గుడ్డి వెలుతురులో వాడెందుకో యిటువైపు తిరిగి చూస్తే, తనప్రక్కన పడుకొనివున్న ఆ రెండో బంటు గాడి ఆకారం చాలా వికృతంగానూ, భయానకం గానూ కనుపించింది. ఆదేమి ఆకారమో ఏమోకానీ, ఆ ముక్కువున్నదే—అది బాగా జానెడుపొడుగువుండి మొఖమంతా ముక్కు తప్పించి మరేమీలేదా అని పించింది. అదీకాకుండా అసలా ముక్కు మనుష్యుల ముక్కులా లేదు. ఏదో పెద్దరకం రాబందుల ముక్కులా కొన తేలి, వంకర తిరిగి చాలా అసహ్యంగా వున్నది. వీటన్నిటికీ తోడు ఆ ముక్కు ముక్కు అంతా గంగసింధూరంలాంటి ఎర్రని ఎర్రరంగు! మిగిలిన శరీరమైనా ఒకతీరున వున్నదేమో అను కొంటే, అదేమిటో అష్టవంకరలు తిరిగివుంది.

నిద్రకళ్లను యిదంతా చూసేసరికి శాంకో



పాంజాగాడికి, తనతో రాత్రి అంత పొద్దుపోయేదాకా కబుర్లు ఆడింది మామూలు మనిషి కానేకాదనీ, అదేదో దెయ్యమో, భూతమో అనే అనుమానం ఒక్కసారిగా తోచింది. అలాటి అనుమానం మనస్సులో మెదిలేసరికి మనిషి ఆపాద మస్తకం గాలిలో పెట్టిన దీపంలా తెగ వణికాడు.

డాన్ క్విక్‌సెట్‌గారు కూడా యీలోగా నిద్దుర లేచారు. మరి ఆయనకూడా తన ప్రత్యర్థి మొఖార విందం చూడవలసిన వాడే! కానీ ఆ అడవి వీరుడు శిరస్త్రాణం తాలూకు యినుపవల మొఖానికి అడ్డంగా వేసుకొన్నాడు. అతగాడు కూడా నిద్దుర లేచి, తెల్ల వారిందని తెలుసుకొని, యుద్ధంచేసే సమయం సమీ పించింది కనుక తన గుర్రాన్ని వెతికి పటుకొచ్చు కొనేందుకు పోయాడు.

ఈలోగా అక్కడ ఆ రెండో బంటు ముక్కును చూసి బెదిరిపోయిన శాంకో పాంజా తన స్వామి వద్దకు పరుగెత్తుకు వచ్చాడు. డాన్ క్విక్‌సెట్‌గారు అప్పటికప్పుడే 'రోజినాన్‌టీ'ని ఎక్కి యుద్ధానికి తయారు అవుతున్నాడు. ఇదిచూసి శాంకో పాంజా గాడికి పట్టుకొన్న భయం మరింత ఎక్కువైంది. అందుకని, ఆయనగారికాళ్లా, వేళ్లాపడి, తనను ఆ చెట్టు ఎక్కించి కూర్చోబెట్టమని ప్రాధేయపడ్డాడు. డాన్ క్విక్‌సెట్‌గారు యుద్ధం హడావుడిలో మునిగిపోయి వుండగా, తాను చస్తే ఆ 'పీడముక్కు' ప్రక్కన ఒంట రిగా వుండలేనని చెప్పి, కయ్యాళిగా ఏడ్చాడు. వీడు యీ వరసను తన యజమానిని బ్రతిమలాడు తుండగా అవతల ఆ ఎర్రముక్కుకు మెళుకవ వచ్చి లేచి నిల్చున్నాడు. డాన్ క్విక్‌సెట్ గారు శాంకో పాంజా చెప్పుతున్న మాటలకు విస్తుపోతూనే, యీ 'ముక్కు' మెదులుతున్న వైపుకు పరీక్షగా చూశాడు. నిజమే—ఆముక్కు, ఆరంగు, ఆమనిషిని చూస్తూ, ఎవరో తనవంటి వీరుడికి తప్ప, మామూలు మనిషికి ఎవరకైనా అంత భయమూ వేసి తీరుతుందని యీాయ నకూ అనిపించింది. శాంకో పాంజా అంత గుండె ఆగి పోయేట్టు ఏడుస్తున్నా అప్పటికి కానీ వాడిమీద ఆయనగారికి జాలి కలుగలేదు. 'సరే'నని శాంకో పాంజాకు చేయి అందించి, గుర్రం వీపుమీదకి

ఎక్కించి, అక్కడనుంచీ ఒక చెట్టు కొమ్మమీదికి పాకించి, యింకా పైకి పాకిపోయి అక్కడ కూర్చోమని సలహాయిచ్చాడు. వాడు చెట్టుకొమ్మ ఎక్కి-ఎక్కటంతోటే చివారు కొమ్మకు పోయి అక్కడ కోతిలా కూర్చొన్నాడు.

ఆ అడవివీరుడికి ఆ ట్టే దూరంపోకుండానే గుర్రం దొరికినట్లుంది; దానిమీద ఎక్కి డాన్ క్విక్ సెట్ గారి మీదకు యుద్ధానికి వచ్చాడు. ఆయన ఎక్కిన గుర్రమైనా, మన డాన్‌క్విక్ సెట్ గారి ముద్దుల గుర్రం 'రోజినాన్‌టీ'కి తోడు పోయిందే! రోజినాన్‌టీ ముట్టె మూరెడు దించుకు పోయి వుంటే, యీ గుఱ్ఱం ముట్టె బారెడు దించుకు పోయింది. తీరా అతడు ఆ చెట్టు దగ్గరకువచ్చి చూస్తే తన ప్రత్యర్థిఅయిన డాన్ క్విక్ సెట్ గారు శాంకో పాంజా గాడిని చెట్టుకొమ్మల మీదకు సరఫరా చేసే పనిలో నిమగ్నులై వున్నారు. అటువంటి వాడిమీద దొంగదెబ్బ తీయటం వీరధర్మం కాదు కనుక, ఎలాగో ఒకలాగుకదులుతున్న తన గుర్రాన్ని కదలకుండా నిల్చోబెట్టి తానూ ఆ చెట్ల కొమ్మల వైపుకే చూస్తూ వుండిపోయాడు.

వెనుకవైపు నుంచీ వినిపించిన గుర్రపు డెక్కల చప్పుళ్లను బట్టి తనమీదకు ఆ అడవి వీరుడు గాలప్ స్పీడులో వచ్చేస్తున్నాడని వూహించుకొని, డాన్ క్విక్ సెట్ గారు 'రోజినాన్‌టీ' డొక్కల్లో ఒక్కతాపు తన్నాడు. 'రోజినాన్‌టీ' అడుగు వేయటంలోనే గాలప్ స్పీడ్ అందుకొన్నది. (ఈసారి డాన్ క్విక్ సెట్ గారి అదృష్టం పండింది. లేకపోతే రోజినాన్‌టీ యిలా ఎప్పుడైనా ఒక్కతాపుకే 'గాలప్' చేసిందా?) ఆ రెండో గుర్రం మాత్రం, రౌతు ఎంత తన్నినా ఎంత గింజుకొన్నా కాలు కదపకుండా కొయ్యబొమ్మలా నిలుచుండిపోయి, ఒక్క అంగుళమైనా ముందుకు కదలలేదు. డాన్ క్విక్ సెట్ గారికి దీనివల్ల మంచి అవకాశం చిక్కింది. ప్రత్యర్థిమీదికి యీటె విసిరాడు. ఆ దెబ్బకు అడవివీరుడు నేలనుకూలాడు.

ఎప్పుడైతే తన యజమాని అవతలి వీరుణ్ణి పడగొట్టేశాడో, అప్పుడే శాంకో పాంజా వుడతలా చెట్టు కొమ్మల మీదినుంచి దిగపాకి, పరుగెత్తుకొంటూ ఆ వీరుడు పడివున్న చోటికి వచ్చేశాడు. డాన్ క్విక్ సెట్ గారు కూడా గుర్రంమీది నుంచీ దిగి పరుగెత్తుకొంటూవచ్చి క్రిందపడివున్న వీరుడి రొమ్ముమీద ఎక్కి కూర్చొన్నాడు. ఇంకా బ్రదికేవున్నాడో చచ్చాడో తెల్సుకొందామని ఆవీరుడు ముఖానికి అడ్డంగావున్న యినపతెరను తొలగించి చూసి,—...

ఆఁ; చూసి ఏమైనాడు ? ఏం చూశాడో ఏమోకానీ-ఆ డాన్ క్విక్ సెట్ గారి ముఖంలో రంగులు గబగబా మారిపోతున్నాయి. ముచ్చెమటలు దిగజారుతున్నాయి. ఇంతకీ ఏం జరిగింది?——

డాన్ క్విక్ సెట్ గారు తనకళ్లను తానే నమ్మలేక పోయాడు. తన చేతిలో దెబ్బలుతిని నేల కొరిగిన యీ వీరుడి ముఖంలో ఆ 'శాంసన్ కరాస్కో' పోలికలు కొట్టవచ్చినట్లు కనిపించాయి. తాను ద్వితీయ జైత్రయాత్రకు 'లామంచా' గ్రామాన్ని విడిచివచ్చే ముందు, తనతో బాగా పరిచయమై, తన ప్రతాపాన్ని మెచ్చుకొంటూ చుట్టుకు చుట్టుకు తిరిగిన ఆ కాలేజి కుర్రాడు 'శాంసన్ కరాస్కో' ముఖకవళికలన్నీ యీతని ముఖంలోనూ కనిపిస్తున్నాయి. ముఖకవళికలో ఒక్కటే కాదు; మూర్తి మూర్తి అంతా అదే పోలికను వున్నది.

ఇంతసేపు డాన్ క్విక్ సెట్ గారు బారాటి కత్తి తనయజమాని గుండెలమీదకు గురిపెట్టి నిల్చొని వుండటం చూసిన ఆ అడివివీరుడి బంటు (అంటే ఆ ఎర్ర ముక్కు) తన యజమానిని చంపేస్తున్నారన్న బెంగ కొద్దీ, పరుగెత్తుకొంటూ వచ్చి, డాన్ క్విక్ సెట్ గారి కాళ్లు రెండూ గట్టిగా పట్టుకొని "చంపకండి బాబూ! చంపకండి. ఈవీరుడు 'లామాంచా' గ్రామంలో మీ పొరుగింటివాడు. మీకు ఎంతో కావలసిన మిత్రుడు; 'శాంసన్ కరాస్కో' ఆయన్ను చంపకండి బాబూ!" అంటూ ప్రాధేయ పడ్డాడు.

ఇంతలో శాంకో పాంజాగాడు అది గమనించినట్లున్నాడు "అరే ఏదీ నీ ముక్కు? నీముక్కు ఏమైంది?" అంటూ అడ్డువచ్చి అడిగాడు. వాడిని అంత హడలెత్తించిన ఆ ముక్కు ఏమైందో ఏమో, మరి ఆ బంటుగాడి ముఖంమీద మాత్రం లేదు!

"వుందండీ బాబూ! ఇక్కడే వున్నది; నా జేబులో వుంది." అంటూ ఆ అడివి వీరుడి బంటు చొక్కా జేబులోకి చేతిని పోనిచ్చి, అట్టతో చేసిన

ముక్కునోక దానిని బయటపెట్టాడు. ఈమాదిరి అట్ట ముక్కులు పిల్లలు తగిలించుకొని ఆడుతూనే వుంటారు శాంకో పాంజాకు ఆవిషయం తెలుసు. అయినా, ఏమిటో—. తెల్లవారు ఝామున ఆమసక చీకటిలో ఆ అట్టముక్కును చూసే అంత భయపడి పోయాడు! అవతలి బంటుగాడి ముఖాన్ని శాంకో పాంజా అప్పుడు పరీక్షగా చూశాడు "అరె! ఇదేమిటి? నువ్వు మాగుడిసె ప్రక్కను ఎడమచేతి వైపునవున్న ఒంటి నిట్టాడి పాకలో వుండే టామ్ సిసైల్‌వి కదూ?" అంటూ శాంకో పాంజా సంభ్రమాశ్చర్యాలు వెళ్లపెట్టాడు.

"అవునండి శాంకో పాంజాగారు! నేను టామ్ సిసైల్ నే;" అని ఆబంటు తనపేరు బయట పెట్టాడు.

ఇప్పటికీ కానీ, గుర్రం మీదినుంచి కూలి పోయిన ఆవీరుడికి స్మారకం రాలేదు. మనిషి కొంచెం కదలటం మొదలుపెట్టాడు. ప్రత్యర్థి కదలుతున్న విషయం గమనించి డాన్ క్విక్‌సెట్ గారు పీకమీద కత్తిఅంచు ఆనించి "టొబోసో' రాజ్ఞి అందాల రాణి, ముత్యాల కోవ 'డల్‌సీనియాను మించిన అందగత్తె సభూతో నభవిష్యతి అని యిప్పుడైనా ఒప్పుకొనుము. అట్లు ఒప్పుకొనక నీ 'కసిల్‌డియా-డి- వాండాలియా', కన్యయే అందకత్తెయని చెప్ప సాహసించితి వేని, నీ ప్రాణములు నీవికావు. జాగ్రత" అంటూ బిగ్గరగా అరిచాడు.

సొంతం స్మారకమైనా రాని స్థితిలో ఆ అడివి వీరుడు (శాంసన్) గత్యంతరం లేక "ఒప్పుకొంటు న్నాను, ఒప్పుకొంటున్నాను... మీ డల్ సీనియా రాకుమారి తొడిగి పారేసిన పాత చెప్పుతోనైనా... మా...'కసిల్‌డియా' కన్య...సరిపోలలేదండి." అంటూ తన పరాజయాన్ని ఒప్పుకొన్నాడు.

డాన్ క్విక్‌సెట్ గారికి అంతటితో కసితీర లేదు. "ఇంతకు మునుపు నీవు 'భీకరానన వీర శూరాగ్రేసర డాన్ క్విక్‌సెట్ గారినే ఓడించితినని ప్రగల్భములు పలికితివే! నీ వోడించిన ఆవీరుడెవ్వడో 'వుూటా' డాన్ క్విక్ సెట్టే కానీ, నిసమైన డాన్ క్విక్‌సెట్ గారు కాదని ఒప్పుకొందువా?" అంటూ గద్దించి అడిగాడు.

ఆవీరుడు అందుకూ ఒప్పేసుకొన్నాడు. అతడు అప్పు డున్న పరిస్థితిలో, యిదేకాదు ఏమాట అయినా సరే ఒప్పేసు కొనేందుకు సిద్ధంగా వున్నాడు. ఏమంటారా?—ఏదో డాన్ క్విక్‌సెట్ గారి మీదవున్న చనువు కొద్దీ యిలా ఆయనను తమాషా చేద్దామనే ఆ 'శాంసన్' యీ వేషాలు వేసుకు వచ్చాడు కానీ, అదే యిలా పీకలమీదకు వచ్చే వ్యవహారం కాబో తున్నదని అతనికేమి తెలుసూ, పాపం! ఏమాత్రం పెనుగులాడినా, ఆ డాన్ క్విక్‌సెట్ గారు పిచ్చి ఆవేశంలో ఏం చేసినా చెయ్యగలడు. అదీకాక— ఆగుర్రం మీదనుంచీ పడ్డపాటుకు, తగిలిన గాయాలకు, చప్పున ఎవడైనా వైద్యుడి దగ్గరకుపోయి యింతమందు వేయించుకోకపోతే లాభంలేదు.

డాన్ క్విక్‌సెట్ గారు మాత్రం మరేమీ షరతులు పెట్టకుండా ఆ వీరుడి గొంతుమీద కత్తిని తీసివేశాడు. ఆవీరుడి ముఖాన్ని పరీక్షగా చూసినప్పటి నుంచీ డాన్ క్విక్‌సెట్ గారికి ఒక అనుమానం పట్టుకు పీడిస్తున్నది. ఇతనిలో ఆ 'శాంసన్' పోలికలు యీ వీరుడికి ఎలా వచ్చాయో, యీయన గారికి ఎంత ఆలోచించినా అర్థంకాలేదు. వీడెవడో నిజమైన వీరుడే ననీ, మొదటినుంచీ తన వుసురు పోసుకొంటున్న ఆమాంత్రికుడే తనమీద అక్కసు కొద్దీ, చేతిలో చిక్కిన వీరుణ్ణి తన మిత్రుణ్ణిగా మార్చి పారేశాడనీ యీయన చాలా దిగులు పడ్డాడు.

చావు తప్పినందుకు సంతోషిస్తూ ఆ శాంసన్ తన బంటును వెంటబెట్టుకు లామంచా వైపుకు వెళ్లి పోయాడు.

(ఇంకావుంది)

# వై. జి. శ్రీమతిగారి చిత్రాలు

మద్రాసు, వాసి వై. జి. శ్రీమతి గారు తాము రచించిన 68 చిత్రాలను దక్షిణభారత చిత్రకారుల సంఘ యాజమాన్యాన ప్రభుత్వమ్యూజియం (ఎగ్మూర్) లో యీ 24 నుంచి 31 వరకు ప్రదర్శించారు. ప్రదర్శనానికి ముఖ్యమంత్రి సి రాజగోపాలాచారిగారు ప్రారంభోత్సవం జరిపారు. స్కూల్ ఆఫ్ ఆర్ట్సు (మద్రాసు) ప్రిన్సిపాల్ దేవీప్రసాద రాయ్ చౌదరిగారు శ్రీమతిగారి చిత్రాలను గురించి నాటి సభలో ప్రస్తావించారు.

ప్రదర్శించబడిన ఆ 68 చిత్రాలు చూస్తే, శ్రీమతి గారికి నీటిరంగులతో చిత్రించటమే అభిమాన విషయమైనట్లు అర్థమౌతున్నది. వేసిన రంగులు కూడా ముదురుగానూ, దట్టంగానూ వుండక తేలికగానే వాడినట్లు కనిపిస్తున్నది. ఇటీవల మనదేశంలో నూ యితర త్రా కూడా విరగా వుండే రంగులు వాడటం ఒక 'ఫేషన్'గా తయారైంది. ఈమె చిత్రాలలో మాత్రం 'అటువంటి' 'నవీనత్వం' మచ్చుకైనా కానరాదు. పది, పదిహేను శతాబ్దాలకు పూర్వం మన చిత్రకారులు ప్రయోగించిన వలవని రంగుల పద్ధతినే యీమె కూడా పాటించారు. నగలు, చట్టలంచులు చేసేటప్పుడు మాత్రం 'టెంపరా' (శుద్ధ రంగులు) యీమె వాడారు.



పరశురాము

శ్రీమతిగారి చిత్రాలలో మహాప్రాతికవంతు దేవతల చిత్రాలే (ఉ॥ 'లక్ష్మి', 'నరసింహావతారం', 'శివతాండవం', 'ఆండాళ్' (గోదాదేవి) 'యశోద, కృష్ణ' మొ॥) ముఖ్యంగా 'లక్ష్మి' 'వాణి' లాంటి చిత్రాలు వేస్తున్నప్పుడు ఆమె ప్రఖ్యాతశిల్పాల ఆకారాలనే తన చిత్రాలకు మాతృకలుగా స్వీకరించారు. ఈ తరహాకు చెందిన చిత్రాలలో చెప్పుకోదగ్గది 'వాణి' చిత్రం.

పురాణాలలోనుంచి, ప్రాచీనకావ్యాలలోనుంచి కొన్ని ఘట్టాలు ఏరి వాటిని కూడా యీమె చిత్రించారు (ఉ॥ 'వసంతసేన – మదనిక', 'కుర్తాళకురవంజి' 'శకుంతల' 'దమయంతి' మొ॥) ఈ తరహాకు చెందినవాటిలో 'ఏకలవ్య' చిత్రం చాలా బాగున్నది. ద్రోణాచార్యుని ప్రతిమను మట్టితో చేసి, ఆ ప్రతిమనే తన గురువుగా భావించి విలువిద్య నేర్చుకొంటున్న ఏకలవ్యుని రూపాన్ని, ఆతనిలోని ఆపట్టుదలను యీమె బాలా బాగా చిత్రించారు. అలాటిదే 'పరశురామ' చిత్రం కూడా. క్షత్రియకులంపై కోపగించిన పరశురాముడు లోకంలో క్షత్రియుడన్నవాడు లేకుండా చేస్తానని ప్రతిజ్ఞపూని గండ్ర గొడ్డలి చేతపట్టిన ఘట్టాన్ని యీమె చిత్రించారు. పరశురాముని కళ్ళలో ఆయనకు వచ్చిన కోపమంతా పూర్తిగా వ్యక్తమౌతున్నది. 'అంతటి ఆవేశంలో వున్న ఆ మూర్తి కూర్చొని వున్నట్లుగా కాకుండా నిలబడి వున్నట్లు చిత్రించివున్నట్లైతే మరింత శోభాయమానంగా వుండేదేమో! పరశురామునివే యీమె రెండు చిత్రాలు వేశారు. ఒకదాంట్లో ఆకాశం, వాతావరణం అరుణంగానూ, మరొకదాంట్లో నీలంగానూ వున్నట్లు చిత్రించారు. ఈ ఒక్క విషయంలో తప్ప ఆ రెండు బొమ్మలకూ వేరే వ్యత్యాసం ఏమీ లేదు. అరుణిమ ఎక్కువగా వున్న చిత్రమే, అర్థయుక్తంగా వున్నది.

అజంతా కుడ్యచిత్రాలకు కొన్ని మచ్చులు తయారుచేసి వాటిని కూడా ప్రదర్శించారు. వీటినిగురించి ప్రత్యేకించి చెప్పవలసింది ఏమీ లేదు.

మొఘల్ బాణీలో రాజకుమారుని చిత్రం ఒకటి చిత్రించారు. అలానే రాజపుట్ బాణీలో చిత్రించిన మరికొన్ని చిత్రాలు కూడా వున్నాయి. రాగమాల చిత్రాలను అనుసరిస్తూ 'రాగిణీ భైరవి' అన్న చిత్రం ఒకటి వున్నది.



అర్ధనారీశ్వర

ఇవికాక మామూలుగా ప్రతి చిత్రకారుడూ చిత్రించ ప్రయత్నించే 'ఆలోచన' 'బొనిఖర్దా' 'సంతనుండి' 'అలంకరణ' వంటి చిత్రాలుకూడా కొన్ని వున్నాయి. వీటిలో చెప్పుకోదగ్గవి 'అలంకరణ' 'సంతనుండి' అన్న చిత్రాలు. కొన్ని కొన్ని చిత్రాలలో యీమె ప్రఖ్యాత చిత్రకారిణి అమృతా షెర్ గిల్ గారి బాణిని అనుసరించబోయిన అనుమానాలు తగులుతున్నాయి.

శ్రీమతిగారు సంపన్న గృహస్థుల యింటి ఆడపడుచు అనీ ఏ గురువుదగ్గిరా చిత్రకళాభ్యాసం చేయలేదనీ తెలుస్తున్నది. గురువు వద్ద నేర్చుకోకపోయినా ఆమె స్వీయశక్తి ఆధారంగా ఆ చిత్రాలు వేసినందుకు మెచ్చుకోవలసిందే. ఏ విద్యఅయినా క్రమంగా నేర్చుకొని వుంటే ఆతరువాత దానిని ఏమూసలో పోసి వుపయోగించినా, అలా వుపయోగించటంలో కొంత తేలికతనం, 'తెలిసినతనం' కన్పించి తీరుతాయి. ఈ విషయాన్ని రాయ్‌చౌదరిగారు తమ ప్రస్తావనలో సూచనగా చెప్పారు. క్రమశిక్షణ పొందని కారణంచేతనే, ఆమె చిత్రాలలో కొన్ని అప్రధానాంశాలపట్ల అవసరమైన దానికంటే ఎక్కువ శ్రద్ధ చూపటం జరిగిందన్నారు.

శ్రీమతిగారు పాడ నేర్చిన వారట. ఈ విషయాన్ని కూడా ప్రస్తావనకు తెస్తూ,

(54-వ పేజీ చూడండి)



ఎస్ కె ఓఝూ తీస్తున్న "నాజ్" హిందీ చిత్రంలో అశోక్‌కుమార్ కొంత ఇండియాలో, కొంత ఈజిప్టు, ఇంగ్లండులలో తీయబడిన ఈచిత్రంలో నళినీ జయవంత్, నవాబ్, వీణ మున్నగు వారు నటిస్తున్నారు

# మన థియేటర్లు

★ కుమారి కె. సరోజ ★

మన దేశంలో చిత్రనిర్మాణం ఏ యేటా అభివృద్ధి అవుతున్న కొద్దీ, చిత్రాలు ప్రదర్శించే థియేటర్ల స్థితిగతులు అథోలోకానికి పోతున్నవి కొత్తగా విడుదల అయిన ఒక చిత్రాన్ని అతి శీఘ్రంగా- మొదటిరోజే - చూచితీరాలని ప్రతి ఒక్కరూ కోరతారు ధనికులయితే, గొప్పతరగతుల టిక్కెట్లను ముందుగా రిజర్వు చేసుకుని, కష్టాన్ని శరీరానికి తగలనివ్వకుండా వెళతారు కాని, సామాన్యప్రజలు ఎంత కష్టపడియైనాసరే, ఆఖరి రెండుతరగతుల టిక్కెట్లను పొందడానికి ప్రయత్నిస్తారు అందుకోసం వారు పడే అవస్థవున్నదే, అది దేవుడికెఱుక అనే చెప్పాలి!

ప్రసిద్ధి చెందిన నటీనటులతో ఒక చిత్రం విడుదలయిందనుకోండి ఆ చిత్రాన్ని చూడడానికి ధనికుల మొదలుకుని, బిచ్చమెత్తేవారివరకూ- ప్రతిఒక్కరు ఆతురతపడతారు ఆ చిత్రాన్ని మొదటిరోజే ధనికులు చూచితీరవచ్చు కాని సామాన్యప్రజలకు వచ్చే అడ్డం అంతా ఇంతా కాదు చిత్రం చూసితీరాలనే ఆతురతకొద్దీ, కొందరు తమ వుద్యోగానికి ఆ రోజు సెలవుగూడా పెట్టుతారంటే, అందులో ఆశ్చర్యంలేదు! అంతటితో తీరిపోతుందా? అప్పో, సప్పో చేసి, డబ్బు సంపాదించుకుంటారు ఉన్న అన్నాన్ని ఒకటికిసగంగా తిని, ఆఖరికి ఏ కొన్ని గంటల ముందుగానో, థియేటరుకి చేరుకుంటారు వారి కళ్ళబడేదేమిటంటే, ఆఖరి రెండు తరగతుల టిక్కెట్లు కొనుక్కునే బుకింగ్ ఆఫీసువద్దనున్న 'క్యూ' మాత్రమే!

ఎండ నూటపది డిగ్రీలుపెట్టి నిగడకాస్తోంది, క్యూలో నిలుచున్నవారిలో కొందరికి పాదరక్షలులేవు; కాళ్ళకు నిప్పులు అంటుకుంటున్నట్లుంది తలలు ఆవిరిలో వుడకబెట్టినట్లుంటవి—ఎండవేడిమికి వడగాలికి శరీరాలు మంటలు పుట్టుకొస్తవి, జలపాతంలాగా చమటలుకారి, దుస్తులు ముద్దలు అవుతాయ్!..ఎన్ని హింసాకాండలు జరిగినాసరే, ఫరవాలేదు- 'మాకు కాలసింది 'టిక్కెట్టు'; మేము చూడవలసింది చిత్రమే' అనుకుంటారు

ఆఖరికి 'టిక్కెట్స్' ఇష్యూఅవుతవి మొదట్లో పైతరగతులు ఇవ్వబడి, తర్వాత ఆఖరి తరగతుల టిక్కెట్లు జారీచేస్తారు గంటలతరబడి నిలుచుని, టిక్కెట్లు పొందుతామని నిరీక్షిస్తారు క్యూలోని ప్రజలు! 'ఫుల్' కొన్ని నిమిషాలకంతా 'ఫుల్' బోర్డు, బుకింగ్ వద్ద వేలాడేస్తారు. అప్పుడే, బయట కేకలు ప్రారంభించుతాయి - బ్లాక్‌మార్కెటింగు టిక్కెట్లు!. ఉన్న ఖరీదుకంటే రెండు మూడింతలు డబ్బుపెట్టి, ఆ బ్లాక్‌మార్కెట్ టిక్కెట్లు కొనుక్కుంటారు (అప్పటికి అన్నితరగతులు ఫుల్ అయివుంటవి) థియేటరులో దూరబడతారు అప్పటికి ఎంత డబ్బు ఖర్చుచేశామనే చింత గూడా వారికుండదు ఎలాగో థియేటరు చేరుకున్నాము చిత్రం చూడబోతున్నామనే తృప్తి వారిలో వుంటుంది [illegible] గంటల [illegible] బడి తమను వేధించిన [illegible] [illegible] గూడా

మరచి, 'హాయిగా' కూచుని, చల్లటి గాలి కోసం ఎదురు చూస్తారు.

అయితే వారనుభవించే దేమిటంటే, ముందటికంటే, కొన్నిరెట్లు కష్టాన్ని, బాధను మాత్రమే!...ఆ థియేటర్లో 'ఫర్లాంగురాయి' వున్నట్లు, ఒక్క తరగతికి ఒక్క 'ఫాన్' మాత్రమే, అదీ ఆరిపోయే దీపం స్థితిలో వుంటుంది. ఇంతలో చిత్రం తెరమీద పరుగెడుతుంది.

'సోడా-కలర్,'-'బీడీ సిగరెట్' కేకలు హాలులో ప్రారంభమవుతాయి. మరి ఆ కేకలు వినడమా, తెరపై దృశ్యాన్ని చూడడమా?...ఇంతలో ఏ మహానుభావుడో తలుపులు తెరచుకుని లోపల ప్రవేశిస్తాడు; లేదా బయటకు వెడతాడు. బయటి వెలుతురు తెరమీది వెలుతురుతో ఏకీభవిస్తుండా సమయంలో. ఈలలూ, కేకలూ గోలపెడతాయి. అప్పటికి మంచి మాటలు కొన్ని గడిచిపోతాయి తెరమీద. ఇంతలో బల్లల్లోనుండి 'ఇంజక్షన్లు' ప్రారంభమౌతాయి. నల్లులు యమదూతలలాగా శరీరంపై ప్రయాణం సాగిస్తాయి. ఆ నల్లులను చూసి, వాటిని చంపి, తీరే లోపల మరో చక్కటి పాటో, లేక మాటో లేక దృశ్యమో, తెరనుండి మరగిపోతాయి. పోనీ, యిన్ని బాధల్ని సహించుకుని తెరమీదికి కళ్లు నిగిడ్చుకున్నా, ముందు కూర్చున్న వ్యక్తి, చేతబుచ్చుకున్న న్యూస్ పేపరుతో విసురుకోడం మొదలు పెట్టాడు. 'ఏమయ్యా!...అడ్డుపడుతోంది' అంటే, 'గాలి రాలేదంటా' డాయన. 'ఇంతలో వెనుకనుండి దగ్గు; అదీ ఆ దగ్గు విసురు చుట్టుపక్కలవారి మీద పడేట్టు-ఆ దగ్గే వ్యక్తికి నచ్చచెప్పేందుకు కొన్ని గొంతులు లేస్తాయి ఆ క్షణంలో. ఇంతలో మరో ఆయన చిత్రంలోని నాయిక అంగ సౌష్టవాన్ని పక్కన తన స్నేహితుడివద్ద వర్ణించడం మొదలు పెడతాడు. ఇంతలో చిత్రం పూర్తవుతుంది. అంతే! బయట పడవలసిందే—ఆ మధ్య తరగతు లందరూ! బయటికొచ్చినవారిలో ఎవ్వరినైనా ఒకరు చిత్రాన్ని గూర్చి అడిగితే, నోరు చప్పరిస్తారు వారు. అందువల్ల, తతిమావారు నిరుత్సాహపడతారు—ఆ చిత్రం బాగులేదేమోనని. ఇంతకీ ఆ చిత్రం గొప్పచిత్రమే

జానపద చిత్రాలకు అద్భుతమైన సెట్టింగులే ముఖ్యంకనుక, దేశకాలపాత్రలతో నిమిత్తంలేదు గనుక, అజంతావారి "వయారిభామ"లో సులోచన, సి. యస్. ఆర్. చేస్తున్న నృత్యం పాశ్చాత్య నృత్యమని ఎవరూ పట్టించుకోనక్కర్లేదు.





పంజాబ్ ఫిల్మ్ కార్పొరేషన్ వారి "జమానేకీ హవా" లో హసన్ బానూ, ప్రాణ్.

కావచ్చు. అసౌకర్యాలవల్ల కలిగే బాధలను సహించుకోలేని ప్రేక్షకులు, అది గొప్ప చిత్రమైనా, చచ్చు చిత్రమని వారు పలుకుతారంటే, అందుకు కారణం చిత్రం ప్రదర్శించే థియేటరు కాదూ?...

ఈ వింతల్ని గమనించండి—

(1) బుకింగ్ ఆఫీసువద్ద '*One for a head*' అని రాసివుంటుంది. అయితే బ్లాక్ మార్కెటీర్ల చేతులలోకి, కట్టలు కట్టలుగా టిక్కెట్లు వస్తాయి. మరి ఎలా వస్తాయో?...

(2) క్యూలో నిలవారిని క్రమంగా పోనివ్వడానికిగాను పోలీసు రక్షణ. మరి బ్లాక్ మార్కెటీర్లు—టిక్కెట్లు జారీ చేసేముందు క్యూ ప్రథమంలో ప్రత్యక్షమవుతారు. అది చూస్తూ చూస్తూ, శిలల్లా నిలబడతారు పోలీసులు.

(3) '*Smoking Prohibited*' అనే బోర్డు తెరమీద పదేపదే వస్తుంటుంది— అయితే, హాలులో సిగరెట్, బీడీల వారి కేకలు అంతు ఉండదు.

ఇదీ ప్రభుత్వము థియేటర్లపై తీసుకున్న అక్కర!......ఇప్పటికి మద్రాసులో ఏ పాతిక థియేటర్లో తప్ప, మిగతావన్నీ ఈ విధంగానే వున్నాయి. ప్రభుత్వం వీటిమీదంతా తగుశ్రద్ధ తీసుకుని, ప్రేక్షకుల బాధలను నివారించగలిగితే, సినిమాలో కొన్ని మరీమరీ అపేక్షిస్తూ, ఆనందిస్తారు ప్రేక్షకులు. ★

## సినిమా వార్తలు

ఆరోజు కారోజు చిత్రనిర్మాణవ్యయం మితి మీరి పోవటం, తయారైన చిత్రాల్లో అధికభాగం నష్టపడటం మూలంగా సినిమా పరిశ్రమలో 'స్లంప్' ఏర్పడినట్లు పలువురు భావిస్తున్నారు. ఈ సినీస్లంప్ మన దేశంలోనే కాక అమెరికాలోకూడా ప్రారంభమైంది చాలా నిర్మాణ సంస్థలు ఖర్చు తగ్గించుకోడానికి ప్రయత్నిస్తున్నాయి అమెరికాకంటే ఎక్కువగా బ్రిటన్, ఫ్రాన్సులు దెబ్బతిన్నాయి. బ్రిటన్‌లో అనేక స్టూడియోలు ఒకదానితర్వాత మరొకటి మూసివేయబడ్డాయి. ఫ్రాన్సులో అమెరికన్ పోటీ మూలంగాను, ద్రవ్యోల్బణం మూలంగాను సినిమా పరిశ్రమ తీవ్రంగా దెబ్బతిని, మళ్లీ కోలుకోలేని స్థితిలో పడింది. మన దేశంలో బొంబాయి సినిమాపరిశ్రమ కూడా ఒక సంవత్సరంనుండీ విపరీతంగా దెబ్బతినటం ప్రారంభించింది. చిత్రనిర్మాణంలో బొంబాయితో పోటీ చెయ్యలేకపోయినా మద్రాసు సినిమాపరిశ్రమ ఇప్పటివరకూ పురోభిముఖంగానే వుందని చెప్పాలి. అయితే ఇటీవల జెమినీ స్టూడియోలో జరుగుతున్న రిట్రెంచ్‌మెంటు దృష్ట్యా మద్రాసు సినిమారంగానికి కూడా ఒక ఊపు తగులుతుందా అని అనుమానపడవలసివస్తోంది.

భారతదేశంలోని సుస్థిరమైన సంస్థలలో జెమినీ స్టూడియో ఒకటి చంద్రలేఖ, అపూర్వ సహోదరులు, సంసారం, చిత్రాలతో దేశమంతటా అపూర్వ ఖ్యాతి ఆర్జిం

చుకుంది ఈ సంస్థ. కాని మంగళ, హిందీపాతాళభైరవి, శ్రీసన్న మొదలైన చిత్రాలు నష్టపడటంతో ఈ సంస్థకు నిరుత్సాహం ప్రబలినట్లు తోస్తుంది.

ఇటీవల జెమినీవారు. తమ స్టూడియోలో వివిధశాఖల ఉద్యోగులను, పనివారిని 150 మంది దాకా రిట్రెంచ్ చేసినట్లు తెలుస్తోంది. ఒక కెమేరా యూనిట్ను, లాబొరేటరీ శాఖలో సగం మందిని, తీసివేశారట. జెమినీవారు తమ ఉద్యోగులకు ఇచ్చే వేతనధనం నెలనెలా లక్ష రూపాయలదాకా ఉంటోందట. కనుక రిట్రెంచ్‌మెంట్‌కు కారణం సులభంగా ఊహించుకోవచ్చు. జెమినీవంటి సుస్థిర సంస్థలే ఇంత ముందు జాగ్రత్తపడుతున్నాయంటే చిత్రనిర్మాణ వ్యయం విషయంలో మిగతా చిన్న సంస్థలు ఎంత జాగ్రత్తపడాలో చెప్పనక్కరలేదు.

*　*　*　*

నవయుగవారి "జ్యోతి" సుమారు ఆరురీళ్ళవరకూ తయారైంది. ఇటీవలనే వాహినీలో ఒక పెద్ద సెట్టుమీద పని పూర్తయింది. త్వరలో మరొక సెట్టు వేయబోతున్నారు. ఈ సంవత్సరాంతానికి నిర్మాణం ముగించాలని నవయుగవారు అనుకుంటున్నారు.

*　*　*　*

రాజాప్రొడక్షన్స వారి "పుట్టిల్లు" చిత్రాన్ని తమిళంలోకి కూడా డబ్ చేయాలని కుతూహల పడుతున్నట్లు తెలుస్తోంది. ఇప్పటికి 25 కాల్‌షీట్ల పనితో 6½ వేల అడుగులదాకా ఎడిట్ చేయబడింది. మరొక రెండుమాసాల్లో చిత్రం పూర్తిచేయాలని డా॥ రాజారావుగారుప ట్టుదలగా ఉన్నారు. ఈనెల 2వ తేదీనుండి మరొక కొత్తసెట్టు ప్రారంభిస్తున్నారు. సర్కారుజిల్లాలలో జనతావారు, నెల్లూరు, రాయలసీమ, నైజాం, మైసూరు, మద్రాసు నగరం ప్రాంతాలలో, మిత్రాడి స్ట్రిబ్యూటర్సు ఈ చిత్రాన్ని విడుదలచేస్తారు.

*　*　*　*

హాలీవుడ్ వారిచే ఆహ్వానింపబడిన భారతీయ ఫిల్ము ప్రతినిధులు సెప్టెంబరు 12న ఢిల్లీనుంచి బయలుదేరుతారట. 14 గురు సభ్యులుండగల ఈ ప్రతినిధి దళంలో నర్గీస్, రాజకపూర్, సూర్యకుమారి, చందూలాల్ షా, కేకీమోడీ, కె. సుబ్రహ్మణ్యం, ద్వారకదాస్ దివేచా ఉంటారట.

*　*　*　*

కొద్దిరోజులకిందట వెనిస్‌నగరంలో జరిగిన చలన చిత్రోత్సవంలో భారతీయ నిర్మాత చేతన్ ఆనంద్ తీసిన "ఆంధియాన్" అనే హిందీచిత్రం ప్రదర్శించబడింది. ఫ్రెంచి సబ్‌టైటిల్సుగల ఈ చిత్రాన్ని యూరపియన్ నగరాలల్లో విడుదల చేయించాలని చేతన్ ఆనంద్ ప్రయత్నిస్తున్నాడట. వెనిస్ ఉత్సవానికి చేతన్ ఆనంద్ అతని తమ్ముడు, నటుడుఅయిన దేవానంద్, కూడా హాజరయ్యారు. ఈ ఉత్సవంలో విమర్శకుల ప్రశంసను అన్నిటికంటే ఎక్కువగా పొందిన చిత్రం కెంజీ మిజగుచీ అనే జపానీస్ నిర్మాతతీసిన "ఓహారూ జీవితం" అనే చిత్రం. యూరపియన్, అమెరికన్ ప్రమాణాలప్రకారం జపానీస్ చిత్రం 'సోటెంపో'లో ఉన్నా డైరెక్షను, ఫొటోగ్రఫీల దృష్ట్యా అత్యుత్తమంగా ఉందట.



పీపుల్స ఆర్ట్ వారి "పల్లెటూరు"లో
విలన్—రంగారావు

*　*　*

బొంబాయి, ప్రకాష్ స్టూడియోస్‌లో రత్నదీప్ పిక్చర్సు అనే కొత్తసంస్థ "నవలఖా హార్" అనే హిందీచిత్రం నిర్మాణం ప్రారంభించింది. ఆగస్టు 15న ప్రసిద్ధ నిర్మాత విజయభట్ ఫై చిత్రానికి ప్రారంభోత్సవం చేశాడు. రాజపుత్రస్థాన జానపద కథపై ఆధారపడిన ఈ చిత్రంలో మీనాకుమారి, అరవిందకుమార్, జీవన్, దుర్గాఖోటే, ఈశ్వర్‌లాల్ నటిస్తున్నారు. విజయభట్ సోదరుడుహాల్ సుఖ్ భట్, బాలచందర్ శుక్లా డైరెక్టర్లుగా పని చేస్తున్నారు. ఈ చిత్రానికి దక్షిణదేశంలో

జ్యోతి కుట్టుమిషన్ పెట్టడం తండ్రి కిష్టంలేదు. ఆమె కుట్టిన బట్టలన్నీ చిందరవందర చేస్తాడు. సమయానికి 'మధు' వచ్చి జ్యోతికి అండగా నిలుస్తాడు.

**నవయుగవారి "జ్యోతి"లో జి. వరలక్ష్మి, శ్రీరామమూర్తి.**



అంజలీవారి "పరదేశి" సెట్టుమీద డైరెక్టరు ప్రసాద్ ఫలోక్తికి అంజలీదేవి, వసంతి, **గణేశన్ నవ్వుతున్నారు.**

డిస్ట్రిబ్యూటర్లు బెంగుళూరు లక్ష్మీఫిల్మ్ కంపెనీవారు.

* * *

సౌందర్య పిక్చర్సువారు మద్రాసు, స్టార్ కంబైన్స్ స్టూడియోలో "ప్రేమ జాలం" అనే తెలుగుచిత్రం తీస్తున్నారు. ఈచిత్రంలో నాయికగా నటిస్తున్న కొత్తనటి టి. ఆర్. రాధ ఇటీవల వుడ్లాండ్స్‌లో 18వ జన్మదినం జరుపుకుంటూ పత్రికలవారిని, స్నేహితులను ఆహ్వానించింది. ఆ సందర్భంలో ఆమె త్వరలో తారాపథం అందుకో గలదని ఆశిస్తూ హాస్యనటుడు శివరావు ఉపన్యసించాడు. ★

తండ్రి చదువు మాన్పిస్తానన్నా అన్న చదివిస్తానంటున్నాడు. ఈ ఆనందంలో సుశీల తన భవిష్యత్తును తలచుకుని గుటకలు వేస్తూ వెలుగులోకి చూస్తోంది.

**"పుట్టిల్లు"లో జమున.**

# ప్రశ్నలు సమాధానాలు

వి. వెంకటరావు—కాకినాడ.

"చల్ మోహనరంగా" అనే జానపద గీతాన్ని ఆనాడు వ్రాసినవారెవరు?

—ఆ పాట ఏకాలంలో ఏ జానపద కవి పాడటం ప్రారంభించాడో మనకి తెలియదు. కాని ఆ పాటకి రానురాను అనేక చరణాలు చేర్చబడి పెద్దపాటగా తయారైంది. ఆ కవిత్వానికి కర్త తెలుగుజాతే అని చెప్పుకోవాలి.

*        *        *

డి. వి. సుబ్బారావు—నెల్లూరు.

"మనుష్యులు చనిపోయిన తర్వాత వారి ఆత్మలు యమలోకమునకు పోయి అచట నానా అవస్థలకూ గురియగును." ఇది ఎంత వరకూ నిజము?

—యమలోకమునుగాని, యమలోక వార్తలనుగాని, గుర్తించి చెప్పగల విజ్ఞానికు డింకా పుట్టలేదు స్వామీ.

*        *        *

ధూపంగోకర్ణయ్య—రేపల్లె.

నేను "గాంధీ మహాత్ముని జీవిత చరిత్ర" సినిమా తీయుచున్నారని, నా స్నేహితుడు తీయుటలేదని వాదించుకొనుచున్నాము. మీరు ఎవరి మాట ఖాయము చేస్తారు? గాంధీమహాత్మునకు ఎవరు నటించుచున్నారు?

—బెర్నార్డు షా నాటకాలు సినిమాలుగా తీయటంలో పేరుపొందిన గేబ్రియల్ పాస్కల్ గాంధీజీ జీవితం సినిమాగా తీయ నిశ్చయించాడు. వచ్చే ఏడు గాని నిర్మాణం ప్రారంభం కాదట. గాంధీజీ పాత్రకు భారతీయ నటుణ్ణే తీసుకోవాలని పాస్కల్ అనుకుంటున్నాడట. ఇంకా ఎవర్నీ నిర్ణయం చేయలేదు.

*        *        *

శ్రీ బిట్రా నాగేశ్వరరావు—మంచికలపూడి.

కంట్రోల్సు ఎత్తివేయటంలో రాజాజీ ముఖ్య ఉద్దేశ మేమైయుంటుందండీ?

—ఎత్తివేయడంలో ఎత్తు ఏమీ లేదు. కంట్రోల్సు ఎత్తివేస్తే, మనకు మంచిదశ ఎత్తుకుంటుందని ఎంచి యీ పని చేశారు. గాని ఇది ఒక ఎత్తు కాదు జిత్తు కాదు.

*        *        *

శ్రీ సి. వి. యస్. శ్యామ్—కడప.

భవిష్యత్తుపై గాలిమేడలు నిర్మించుకుంటూవుండే మాబోటి విద్యార్థులకు మీ సలహా ఏమిటి?

—ప్రస్తుతం మీకు గాలిలో మేడల కంటె మేడలలో గాలి మంచిది, దేహ వికాసానికి బుద్ధి వికాసానికికూడా.

*        *        *

డి. పాపయ్యశాస్త్రి—తెనాలి.

సినిమారంగములో ఆంధ్రులకు ఎక్కువ పేరున్నదా అరవలకు ఎక్కువ పేరున్నదా?

—ప్రస్తుతం ఆంధ్రుల దే పై చెయ్యిగా ఉన్నట్టు కనిపిస్తోంది.

*        *        *

పి హనుమంతరావు—ఈమని.

ఇటీవల గాలివానలూ, సముద్రములోని వత్తిడి గుండములూ బహు జాస్తిగా వచ్చుచున్నవి. దీనికి కారణము అమెరికావారు జపానులో వేసిన యాటంబాంబేనని మా స్నేహితులు వాదించుచున్నారు. దీనికి మీ రేమంటారు?

—అలా వాదించడానికి తగినంత ఉపపత్తి ఇంకా లభ్యపడలేదంటాను.

*        *        *

వి. ఎస్. అచ్యుతరావు—గన్నవరం.

రాజ్యం పిక్చర్సు వారి "దాసి" చిత్రానికి డైరక్టరు ప్రసాద్ అని కొన్ని పత్రికలలోను, రంగనాధదాస్ అని కొన్ని పత్రికలలోను ప్రకటించేరు. "దాసి" డైరక్టరు ఎవరో తెలియచేయండి.

—"దాసి" చిత్రానికి డైరెక్టరు దాసుగారే. ప్రసాద్ గారు పర్యవేక్షణమాత్రమే చేస్తున్నారు.

*        *        *

శ్రీ పి. నరసింహాచార్యులు—బందరు.

ఒకప్పుడు వెలిగిన కాంగ్రెసు సంస్థను అధికారంలోకి వచ్చిన తరువాత అవి నీతిని అంటగట్టి తూర్పారబట్టి రూపు మాపుతున్నారు అదేవిధంగా "కమ్యూనిస్టు"లు (ఇప్పుడెంతో సామరస్యంలోవున్నా) అధికారంలోకివస్తే వారూ శాఖోపశాఖలుగా చీలిపోగల రంటాను. ఏమంటారు?

—ఏమంటారు? "ఎవరి తత్వం ఎట్లా మారుతుందో ఎవ్వారెఱుంగుదురు? ఏరీతి ఎట్లుంటునో?" కాని, అధికారంవస్తే అతని కంటె ఘనుడు. ఆ చంటమల్లన్న—అంటారు—ఏమైనా, "సబ్ కో సన్మతిదే భగవాన్" అంటాము.

గల్పిక అంటే డెఫినిషన్ ఏమిటి?

—"అల్పకల్పన గల్పిక" అని నిర్వచించాలి పొట్టికథకంటె చిన్నదైన పిట్టకథ—ఇంతకంటే ఇంకా నిర్వచనం కావాలంటే నిర్వచనంగా ఉండటమే, ఉత్తమం.

*        *        *

బళ్లారి ఖలందికోసాబు—ఉరవకొండ.

అమెరికాలో రాత్రి అయితే, ఇక్కడ పగలు అంటారు ఎంతవరకు నిజమండి?

ప్రపంచం ఉన్నంతవరకూ నిజమే.

*        *        *

మిస్. శ్రీదేవి—కడప.

లండన్ పౌరులు ఆన్ చిత్రానికి గొప్ప స్వాగతమిచ్చినారని పత్రికలు వ్రాసినవి. వారికి హిందీ అర్థమైనదా లేక దానిలోని దృశ్యములు బాగున్నవని మెచ్చుకొనినారా?

—బహుశా ఏమీ అర్థమై ఉండదు. అందుకనే బావుందని మెచ్చుకుని ఉంటారు.

హిందీతారలు రాను రాను ఇంగ్లీషు తారలు మాదిరి దుస్తులు ధరించుచున్నారు. ప్రభుత్వము దీని నెందుకు నిషేధించలేదు.

—ప్రభుత్వంవరకూ పోనక్కరలేదు. ప్రజలే అటువంటి చిత్రాలను తిరస్కరించవచ్చును.

*        *        *

శ్రీ కొండముది దత్తాత్రేయులు—అప్పికట్ల.

రష్యావారు గాని అమెరికావారు గాని శాంతికి చిహ్నంగా పావురములను వేస్తారు. (ఎగురుతున్న పావురము-నోటిలో పచ్చని చెట్టురెమ్మతో ఉన్న పావురము.) శాంతికి పావురం చిహ్నమా? ఇతర పక్షుల్ని ఎందుకు వెయ్యకూడదో తెలుపండి.

—శాంతికి "హంసను" చిహ్నంగా వేయవచ్చు. అది మన సంప్రదాయం. ఇంకా సందేహమెందుకు? ఓం శాంతి శ్శాంతి శ్శాంతిః—"ఓం" అనే ప్రణవాక్షరమే చాలు చిహ్నంగా. క్రయిస్తవుల బైబిలులో పాతనిబంధనలో ఆదికాండం చూడండి—సృష్ట్యాదిని జలప్రళయంవచ్చి తగ్గినప్పుడు, నోవహు నావలోనుంచి పావురం బయటకు ఎగిరివెళ్ళింది. బైబిలులో కొత్తనిబంధనలో సువార్తలు చూడండి. ఉపవాసదీక్షానంతరం యేసు క్రీస్తుమీద పరిశుద్ధాత్మ పావురంలాగా వచ్చి ఆవహించింది. ఈ పావురమే క్రైస్తవ శాంతిచిహ్నం.

* * *

శ్రీ భీమసేన్ నిర్మల్ సికింద్రాబాదు.

సర్ రాధాకృష్ణన్ ఆంధ్రుడే గదా? ఆయన స్వగ్రామమెద్ది?

—ఆంధ్రుడే గదా అని అనుమానిస్తూ అడుగుతున్నారు. మంచిదే—"కృష్ణన్" అనే పేరు అరవపోకడగా ఉన్నా, ఆయన యింటిపేరు సర్వేపల్లి వారు—ఆయన స్వగ్రామం తిరుపతి సమీపంలో ఉన్న తిరుత్తని.

* * *

పాతూరి పిచ్చయ్య—గుంటూరు.

మీరు ప్రచురించే కథలు విజ్ఞానానికని నేను, కాదు వినోదానికని మా మిత్రుడు వాదించుకుంటున్నాము. మీరు ఎవరితో ఏకీభవిస్తారు?

—మీరిద్దరు కలిసి రైటు; విడివిడిగా తప్పు.

* * *

కామ్రేడ్, బి. మంగరాజు—బొబ్బిలి.

మద్యనిషేధం అమలుపర్చిన అయిదేళ్ళలో త్రాగుబోతుల సంఖ్య రెండింతలు పెరిగింది. దీనివల్ల ప్రభుత్వం ఎంతో నష్టాన్ని భరించి ప్రజలను బాగుచేయాలని తలచింది. కాని ఆ వూహాలు ఎంతమాత్రం వుపయోగించకపోవడంలో లోపము ప్రజలదా? ప్రభుత్వోద్యోగులదా? ప్రభుత్వం బుద్ధిలోపమా?

—త్రాగుబోతుల సంఖ్యగురించి మీ అంచనా దొరికింది? అంచనాల తప్పులూ బులో హాలా అందరికీ ఉమ్మడి.

సూర్యదేవర మల్లికార్జున రావు—వడ్లమూడి.

"సన్నివేశము" అంటే ఏమిటి? సినిమాలలోను; కథలలోను; అది ఎంతవరకు తోడ్పడుతుంది? ఉదాహరణలతో సహా వివరించండి.

—సినిమాలో గాని కథలో గాని కొన్ని సన్నివేశాలుంటాయి. సన్నివేశం అంటే ఒకఘట్టం. కథకు ఒకరూపం ఇచ్చేందుకవసరమైన సంఘటన ఏదో ఆఘట్టంలో జరుగుతుంది. దీనికి ఉదాహరణ ప్రతి సినిమాలోను కనిపిస్తుంది.

* * *

శ్రీ గరిగిపాటి వెంకటసుబ్బారావు, సాహితీకేంద్రము—రేపల్లె.

కొన్ని పార్టీలవారు మానవునకు కావలసింది తిండి గుడ్డ అంటారు. మానవునకు కావలసినది తిండి గుడ్డ మాత్రమే అంటారా?

—"శరీరమాద్యం ఖలు ధర్మసాధనం"—జీవిత పరమార్థమైన ఆత్మ పరిపక్వతను పొందడానికి కొన్ని ధర్మములను నిర్వర్తించాలి. అందుకోరకై దేహమును బుద్ధిని చక్కగా పోషించి కాపాడాలి. అందు నిమిత్తం అన్నవస్త్రాలు అవసరం. సిద్ధి పొందిన మహాయోగులకు అవి అనవసరం అవుతాయి. ఈ విషయం ఆయా పార్టీల అభిప్రాయాల కన్నింటికీ అతీతమైనది.

* * *

యం. యస్. భాలకి—విజయవాడ.

బైబిలులో "ప్రపంచమందలి జీవులన్నియూ ఆరుదినములలో పుట్టినవి" అని వున్నది ఈ విషయాలు నమ్మవచ్చునంటారా?

—బైబిలులోనే కాదు, ప్రకృతి విరుద్ధములైన రాతలు ఏ మతగ్రంథములో వున్నా నమ్మకూడదు, ఏమంటారా? మత గ్రంథాలలోని విజ్ఞానవిషయాలు ప్రకృతి పరిశోధకుల కృషిఫలితాలు కావు. కనక పరీక్షకి నిలవవు పరీక్షకి నిలిచే విజ్ఞాన విశేషాలే నమ్మతగినవి.

* * *

శ్రీమతి శ్యామలాదేవి—నర్సాపురం:

అయ్యా! 'ముష్టివారికి బిచ్చము వేయరాదని ఒకరు వాదిస్తారు. వారిని రక్షించుటమన కర్తవ్యమని మరొకరు వాదిస్తారు. బిచ్చము వేసినయెడల ముష్టిజీవనాన్ని అభివృద్ధిచేస్తున్నామని ఒకని వాదన...అపదలో ఉన్నవారిని ఆదుకోవడం మన లక్ష్యం అని రెండవవాని వాదన-ఇందులో తమ అభిప్రాయం సెలవిస్తారా?

—ఇది కేవలం ముష్టి ప్రశ్న అని త్రోసివేయుటకు వీలు లేదు. ఒక ప్రాణియెడల మనము దయగాని దాక్షిణ్యం గాని చూపించడం ఎందుకంటే, మన హృదయంలో దయారసం వృద్ధియగుట కొరకే—"తనయందు నిఖిల భూతములందు నొకభంగి సమహితత్వంబును" సాధించెయ్యాలి ఆ విధంగా మన అంతరాత్మ పరిపక్వం కావాలి. అదే మోక్షం—దానం, ధర్మం, త్యాగం యివన్నీ మోక్షానికి, అనగా ఆత్మముక్తికి సాధన విధానాలు. ముష్టివానిని రక్షించడం లోకాన్ని ఉద్ధరించడం, ఇదంతా మనమూలంగా జరుగుతుంది అనే అహంకారం అజ్ఞానం.

* * *

శ్రీ యన్. ఆనంద్—విజయవాడ.

రాజాజీ రాయలసీమ పర్యటన గావించుచు కర్నూలు జిల్లాలోని క్షామప్రాంతాలకు రాలేదేమి? ఆంధ్రకోస్తా జిల్లాయని భయపడినారా?

—ఆచార్యులవారికి భయం నాస్తి. అపఖ్యాతి భయం నాస్తి అప్పళాచార్య సన్నిధా. అవసరం అయితే కోస్తాకూడావచ్చి చూస్తారు. కర్నూలు అంటే కలలోకూడా భయపడరు. అక్కడ క్షామంపోయే లోపల తప్పక ఒకసారి రావచ్చు.

* * *

వత్సా వెంకటరాజు—సాలూరు.

రాష్ట్రశాసనసభలో గాని, ప్రజాప్రతినిధుల సభలో గాని సభ్యులు, యే పార్టీకి చెందినా, యే బిల్లుపైనైనా వారి అభిప్రాయానుసారం, స్వేచ్ఛగా ఓటు చేయవచ్చునా? అట్టి స్వేచ్ఛ లేనిచో మెజారిటీ పక్షం ప్రతిపాదించే ప్రతీ బిల్లు తప్పక నెగ్గును కదా? అప్పుడు పరిపాలన ప్రజాస్వామ్యం ఎట్లు అగునో వివరించగలరా?

—ఒక పార్టీ ప్రణాళిక ఆధారంతో ఎన్నికైన సభ్యులు ఆ ప్రణాళికకు కట్టుబడి ఓటు చెయ్యడం ప్రజలకిచ్చిన వాగ్దానాన్ని నిలబెట్టుకున్నట్టు. వాగ్దానభంగం చెయ్యడానికి స్వేచ్ఛ కావాలంటే అది ప్రజాప్రాతినిధ్యం కిందకి జమరాదు. అలా రానిది ప్రజాస్వామ్యం కాదు. ప్రణాళికకు విరుద్ధంగా ప్రభుత్వం బిల్లులు ప్రవేశపెట్టినప్పుడు ప్రతినిధులు పార్టీ నియమాల నతిక్రమించి ఓటు చెయ్యగలిగితే వారికి ప్రజలు బ్రహ్మరథం పడతారు.

* * *

శ్రీహరిరావు—సంగారెడ్డి.

హైద్రాబాదును భాషాప్రాంతాలుగా విభజించాలని రాజప్రముఖుని రద్దు చేయా

లని తెలంగాణా నాయకులు, హిందూమహా సభవారు తీర్మానాలు చేయటం కాంగ్రెసువారికి యిష్టమంటారా? ప్రధాని నెహ్రూ పండితుడు ఈ సూచన ఆమోదిస్తారంటారా?

—తీర్మానాలతో తృప్తిపడేవారిని చూసి ఇష్టపడినా ఒకటే ఇష్టపడకపోయినా ఒకటే.

ద్రవిడకజగం నాయకుడు రామస్వామిగారి హిందీవ్యతిరేక వుద్యమానికి 144 సెక్షను వుపయోగించలేని రాజాజీ, శాసనసభా సమావేశాలకు, అసెంబ్లీ ప్రాంగణంలో ఉపయోగించారు. నాయకరుగారిని చూస్తే రాజాజీకి భయమా?—

—భయమున్న చోట పోలీసుబందోబస్తు చేశారు; లేనిచోట చెయ్యలేదు.

* * *

శ్రీ జి. కె. రామలింగం—తెనాలి.

ఆంధ్రరాష్ట్రము వచ్చినందువల్ల కలుగు లాభమేమి? రానందువల్ల కలుగు నష్టమేమిటో సెలవిచ్చెదరా?

—పై ప్రశ్ననుబట్టి ఆంధ్రులు తమకేదిలాభమో, ఏది నష్టమో తెలిసికొనలేని స్థితిలో ఉన్నారు. గనుక, ఆంధ్రులు తెలివిగలవారై వృద్ధిలోనికి రావడం కోసమే ఆంధ్రరాష్ట్రం ప్రత్యేకంగా కావాలి.

ఎక్కిళ్లు ఎట్లు వచ్చును? వాటిని ఆపుకొనుట ఎట్లు?

—కారపు వస్తువులు మొదలైనవి తింటే ఎక్కిళ్లు వస్తాయి. ఎక్కువ తిండి తింటే కూడా ఎక్కిళ్ళు వస్తాయి. ఎక్కసమైన విధంగా ఏదీ తినకూడదు. అది ఒక పైత్యధోరణి వంటిదే. తగినంత భయం గాని భక్తి గాని యితర లక్ష్యంగాని ఉంటే దాన్ని నిగ్రహించవచ్చు. పిల్లల విషయంలో మాత్రం వాళ్లను భయపెట్టడం వల్లనే అవి అంతర్ధానమౌతాయి. ఎవరినీ లెక్క చెయ్యనివాళ్లకు ఎక్కిళ్లు తగ్గవు. అటువంటివాళ్లకు చక్కిలిగింతలు పెట్టి చూడాలి. లేదా మంచుగడ్డవంటి చల్లని నీరు తాగించాలి. రోజంతా ఎక్కిళ్ళు వచ్చేయెడల 'ఎమెటిన్ హైడ్రోక్లోరైడ్' యింజక్షన్లు యిస్తే తగ్గుతుంది.

* * *

శ్రీ కే. బి. ఆనందరావు—గుంటూరు.

"విజ్ఞానవీధులు" అను శీర్షికలో ఒక సన్యాసి, ఒక తమిళ న్యాయవాదియొక్క బొమ్మలు వేయుచున్నారు. వాటిలో గల అర్థమేమిటో చెప్తారా?

—సన్యాసి బొమ్మ కాదది. విశ్వమర్మములు తెలిసి సృష్టికి ప్రతిసృష్టి చేసిన విశ్వామిత్రునివంటి మహర్షి బొమ్మ అది తమిళ న్యాయవాది బొమ్మ కాదది. పదార్థతత్వవేత్తయైన సి. వి. రామన్ పండితుని జ్ఞప్తికి తెచ్చే బొమ్మ అది. ప్రాచీన నవీన విజ్ఞానచిహ్నాలివి.

* * *

శ్రీ జి. శ్రీరాములు—తెనాలి.

మా కాలేజీలో మా ఫ్రెండ్ ఒకడున్నాడు. అతనికి పెళ్ళాం పిల్లలున్నా చదువుమీద శ్రద్ధ చూపుతూ ఉంటాడు. నేను అతన్ని మీరు ఎలా చదువగలుగుచున్నారని ప్రశ్నిస్తే నవ్వి ఊరుకుంటాడు. కారణం మీరు తెలియజేయగలరా?

—"వివాహో విద్య నాశాయ" అనే మాట అబద్ధమని ఋజువుచేయడానికి అంత శ్రద్ధగా చదువుతున్నాడు. గృహస్థు గనుక మంచిచెడ్డలు గ్రహించి పట్టుదలగా చదువుతున్నాడు. "గార్హస్థ్యమునకు సరియౌ" అన్నారు అల్లసాని పెద్దనగారు అందుచేతనే.

పెద్దలు రాత్రివేళల చెట్టును తాకవద్దంటారు. ఎందుకండి?

—చెట్లకు కూడా నిద్రావస్థ ఉంది. జీవకారుణ్యంగల పెద్దలు వాటి నిద్రాభంగం చేయడానికి ఒప్పుకోలేదు. వైద్యశాస్త్ర ప్రకారంగా ఆకులలో ఉండే జీవధాతువు, ఓజస్సు పగటివేళ తేజస్సుగల సమయంలో ఎక్కువగా ఉంటుంది ఔషధ ప్రభావం అప్పుడే ఎక్కువ

శ్రీ తోలేటి గోపాల్—తెనాలి.

దేశంలో కళ (*Art*) కంటె, శాస్త్రానికి (*Science*) కి ఎక్కువ ప్రాముఖ్యం యివ్వటంవల్ల దేశాన్ని "కాటక" బాధనుండి రక్షించవచ్చని నా అభిప్రాయం. మరి మీ అభిప్రాయ మేమిటి?

—శాస్త్రాభివృద్ధి వల్లనే కళాభివృద్ధి అవుతోంది. సైన్సులో అభివృద్ధి వల్లనే సినిమాకళ వృద్ధి అయింది. ఈ సినిమాల మూలంగా శాస్త్రజ్ఞానం వృద్ధిచేసే అనేక విషయాలు నేర్పవచ్చు. కాని శాస్త్రానికి శాస్త్రం, కళకు కళ శ్రుతి కలియకుండా ప్రవర్తిస్తే మన పని తీర్థానికి తీర్థం ప్రసాదానికి ప్రసాదం అవుతుంది. అంగట్లో అన్నీ ఉన్నా అల్లుని నోట్లో శని అన్నట్లవుతుంది. సమన్వయం లేకపోతే ప్రతి విషయంలోను ఆర్టుకు సైన్సూ, సైన్సుకు ఆర్టూ ప్రతిబంధకం అవుతూ ఉంటుంది.

* * *

శ్రీ వి. కృష్ణమూర్తి—గుంటూరు.

తమరు ప్రధానామాత్యులయితే మొట్టమొదటగా చేసే శాసన మేమిటి?

—"ప్రధానామాత్యుడైనవాడు మొట్టమొదలుగా స్వతంత్రించి ఏ శాసనమూ శాసించకూడదు" అనే శాసనం మొట్టమొదలుగా చేయడం అవుతుంది.

* * *

శ్రీ వై. యల్. యన్. శర్మ
—ఝార్సుగుడ, సంబల్పూరు జిల్లా.

కాంగ్రెసు ప్రభుత్వం వున్నన్నాళ్లూ, ఆంధ్రరాష్ట్రం వచ్చే అవకాశము లేదా కాంగ్రెసు ప్రభుత్వం ఆంధ్రరాష్ట్రాన్ని స్థాపించలేదా?

—"స్థాపించ లేదా?" అనే ప్రశ్నకు అర్థం ఏమిటి? స్థాపించగలదు అని అర్థం. "మీరజాలగలడా నా యానతి వ్రతవిధాన మహిమన్?" అంటే ఏమిటి "మీరజాలడు" అని అర్థం. "స్థాపిగంచలదు" అనే నమ్మకం మీ ప్రశ్నలోనే ధ్వనిస్తోంది. ★

హిట్లరుకు జ్యోతిష్కుల మీద బాగా నమ్మకముండేదట. ఒకరోజున ఒక జ్యోతిష్కుణ్ణి పిలిచి "నేను ఏ రోజున చచ్చిపోతాను?" అని అడిగాడు.

"యూదుజాతి పండగ రోజున," అన్నాడు జ్యోతిష్కుడు.

"యూదులకు చాలా పండగలున్నాయి. ఏ పండగ రోజునో ఖచ్చితంగా చెప్పు," అని గద్దించాడు హిట్లరు.

"ఏ పండగరోజునో చెప్పలేనుగాని మీరు చచ్చిపోయే రోజుమాత్రం యూదులకు పండగ అవుతుంది." -

## వై. జి. శ్రీపతిగారి చిత్రాలు

(45-వ పేజీ తరువాయి)

సంగీతంలో కూడా ప్రవేశంవుంది కనుకనే ఆమె రచించిన చిత్రాలలో 'స్థాయి' అంత బాగా కుదిరిందని చౌదరిగారు అన్నారు.

ఆమె యింతవరకూ అజంతా శైలినే అభిమానించి, దానినే అనుకరించారు. ఇంత పట్టుదలతోనూ, ఆమె మరికొంత కాలం కృషిచేస్తే త్వరలోనే తనకొక ప్రత్యేక శైలిని కుదుర్చుకోగలదని ఆశిస్తున్నాను. —వి. ఎన్.

# జంతుకోటిలో మానవ లక్షణాలు

(36-వ పేజీ తరువాయి)

వున్నది. కుక్క ఎంతసేపటికీ తన యజమానిని సంతోషపెట్టటానికే తంటాలు పడుతుంది. యజమాని పట్ల దీనికి మూఢమైన భక్తి విశ్వాసాలు యిట్టే కుదురుకు పోతాయి- పిల్లి విషయం అలాక్కాదు. యజమాని తనకు 'ఎవడికోసం అన్నం పెట్టుతాడులే' అన్నట్లే వ్యవహరిస్తుంది. కుక్క యజమానికోసం ఎంత నీచమైన పని అయినా నిస్సంకోచంగా చేసేస్తుంది. పిల్లి—ఆడదానిలాగా—వళ్లు అలవని పని అయితేనే చేస్తుంది.

గుర్రమనేది గొప్ప విశ్వాసం గల జంతువుఅని మనమంతా అనుకొంటూ వుంటాం-కానీ, అప్పుడప్పుడూ యీ గుర్రమే చాలా తలబిరుసుగా ప్రవర్తిస్తుందన్న విషయం ఎంతమందికి తెలుసు! తలబిరుసుతనమే కామా-ఒక్కొక్కప్పుడు దానంత పిరికిజంతువు ప్రపంచంలో మరి వుండబోదన్నంత అసహ్యంగా ప్రవర్తిస్తుంది. ఎందుటాకులు చప్పుడైనాకూడా బెదిరిపోయి నానా భీభత్సంచేసి పారేస్తుంది. కానీ మనం వినేకథలలోనూ, చూచే సినిమాలలోనూ గుర్రాలు ఎంతో తెలివితేటలుగలవైనట్లూ, ఎంతో ధైర్యసాహసాలు కల జంతువులైనట్లు చిత్రించటం జరుగుతున్నది. నిజంమాత్రం అది కాదు.

(ఇంకా వుంది.)

ఒక దినపత్రిక సంపాదకుడు ఒక ఊళ్లోని తమ స్వకీయ విలేఖరిని హెచ్చరిస్తూ ఇలా రాశాడు:

"వార్తలుపంపే టప్పుడు మాటలు జాగ్రత్తగా వాడటం అవసరం. ఒకవేళ ఆ వార్త అబద్ధమని తేలితే మనమీదికి ఏమీ రాకుండా చూసుకోవాలి, కనుక ఇకనుంచీ 'తెలుస్తోంది, వదంతిగాఉంది, ఆరోపింపబడింది, ఇత్యాది మాటలు వాడితే బాగుంటుంది."

ఆ విలేఖరి మర్నాడొక వార్త పంపాడు:

"నిన్నటి దినం ఈ ఊళ్లో స్వాతంత్ర్యోత్సవం జరిగినట్టు వదంతిగా ఉంది. సాయంత్రపు బహిరంగ సభకు (ఫలానా) ప్రముఖ నాయకుడు అధ్యక్షత వహించినట్టు, భావించబడుతోంది. ఆయన స్వాతంత్ర్య సిద్ధి తర్వాత దేశం ఏవిధంగా పురోగమించిందో ఉపన్యసించినట్లు ఆశించబడుతోంది. సభ జయప్రదంగా ముగిసినట్లు ఆరోపింపబడింది."

* * *

మేష్టారు:— అన్ని వృక్షాల్లోకి పెద్ద వృక్షమేది?

విద్యార్థి:-వంశ వృక్షం.

# శ్రావణసంధ్య

(30-వ పేజీ తరువాయి)

కటం ఎల్లాగు? అందరికీ భారమైన తను అందరి ఈసడింపులూ భరిస్తూ ఇంకెంత కాలం అలమటించాలి? తన కన్నీళ్ళు చేయి విడిపించే కరుణాత్ముడు లోకంలో లేనే లేడేమో? అవును తనకేముందని? అందమా? చదువా? సంగీతమా? అన్నీ లోపాలనీ కప్పుకుపోయే ధనమా? అసలే లేదు మరి

అందుకే ఆ పల్లెటూళ్ళో ఇరవై రెండేళ్ళ కమల నూరేళ్ళ దిగులు బరువుతో అణగారిపోతోంది. అందరికళ్ళకీ తను అపరాధిగా కనబడుతోంది. అందరికీ తను లోకువ. అందరికీ తనమీద ఎందుకో కారణంలేని కార్పణ్యం. ఆఖరికి తల్లి కూడా కమలని దురదృష్టదేవతగా, విరోధిగా ఈసడిస్తోంది. ఆ మధ్య ఎవరో ఒక పెళ్ళికొడుకు వొచ్చాడు కమలని చూడటానికి. ఇష్టం లేనివాడు మెదలకుండాపోక, కమలది మెల్లచూపు అనీ, ముక్కు వొంకరనీ, ఎత్తుపళ్ళనీ, రాగిజుట్టుఅనీ లకువంకలు పెట్టి ఊరంతా చాటించి మరీ వెళ్లాడు. అప్పట్నుంచీ నిర్భాగ్యురాలు కమల ఊళ్లో ఊసుపోనివాళ్లకి కాలక్షేపమయిపోయింది. కన్నతల్లికి కూడా కమల శత్రువుగా కనబడుతోంది. "ఈ పాడుమొహంది ఇంట్లో వున్నంతకాలమూ మనకీ దరిద్రం తప్పదు!" అనే ఏవగింపు తల్లి ప్రతి చూపులోనూ కమలని సూదులతో గుచ్చేస్తోంది. కమల బతుకు మరీ దుర్భరమైపోతోంది.

పొరుగింటి పుల్లమ్మగారు మొన్నటి హెచ్చరిస్తోంది "తొందరపడాలి. ఈడొచ్చిన పిల్లల్ని ఇంట్లో పెట్టుకూర్చుంటే ఎల్లా? వాళ్ళ కమల చూడండి! పాతికేళ్ళొచ్చినా పెళ్ళి పెటాకులూ లేకుండా పెద ఎద్దులాగా ఇంట్లోపడి తింటోంది. అసలు వాళ్ళ కొంపకి అదే శనిదేవత! ఇంక దాన్ని కట్టుకున్నవాడెవడూ చేసుకోడు. తొందరపడండి. మంచి సంబంధం చూడండి అమ్మాయికి" అనటం విని కమల గజగజలాడిపోయింది. తనేనా ఈ కొంపకి శనిదేవత?

అవును కాబోలు. పొద్దున మామయ్య మాటలూ అదే ధోరణిలో వున్నయ్. అందరికీ తనొక చిక్కుసమస్యగా, పీడగా తయారయి కూచుంది. కాబోలు తన పీడ తరగడం ఎప్పుడవుతుందా అనే అందరూ [illegible] తండ్రికి రెండో పెళ్ళివాడికి ఇవ్వటమంటేనే అరికాలి మంటగా వుండేది. ఇవాళ మామయ్య పటుకు బాణాలలాటి మాటలు విసిరాడు. ఏ దోవన పోయేవాడికైనాసరే తనని అంటగట్టి మూడుముళ్లూ పడ్డయ్యనిపిస్తాడుట. ఏదో దూరపువూళ్ళో ఒక పెళ్ళికొడుకున్నాడుట. ఈ మధ్యనే పెద్ద ఉద్యోగం చేసి పింఛను పుచ్చుకుని మూడో పెళ్లికి తయారుగా వున్నాడుట. మొదటి సంబంధానికి ముగ్గురుకొడుకులూ, రెండో సంబంధానికి నలుగురు కూతుళ్లూ అయినా వయస్సు అరవైలోనే వుంటుందిట. బోలెడంత ఆస్తి వుందిట. కమలని కళ్ళకద్దుకుని చేసుకుంటాడుట. కమల కిష్కారు మనటానికి వీల్లేదుట. ఇంతకి తప్ప వేరేదారి లేదుట. కాదు కూడదంటే కాస్త అవకాశమూ జారిపోతుందిట. అందులో మామయ్య పట్టిన కుందేటికి మూడేకాళ్లు! ఆయన ఎదుట పడటానికే కమల గుండెలు పీచుపీచుమంటయ్.

ఆగి కాళ్ళకింద నేలనలకాక ఇనపసంకెలలాగా వుంది. కమలకి అన్నివైపులనించీ బాణాలు దూసుకొస్తున్నయ్. ఈ వ్యూహాలనించి తను ఎల్లా తప్పుకోవాలి? మూడో పెళ్లి తాతగారి దాంపత్యపు జైలుసాల తనకి తప్పనట్లుగావుంది. ఎందుకు తనకీ నేరంలేని దారుణశిక్ష? తన అసహాయస్థితిని చూసి ఎవరూ జాలిపడరేం? తనపీడ విరగడ ఎల్లాగో ఒకలాగు కావాలనే అందరికీ తొందర. తన ఇష్టాయిష్టాలు, సుఖదుఃఖాలు ఎవరు ఆలోచిస్తారు? ఎవరు తన మొర వింటారు? అసలు అందరిలాగా సుఖపడాలని కోరుకునే హక్కు తనలాటి నిర్భాగ్యురాలికి వుందా?

దూరంగా పాలలోంచి పాము నోట్లోచిక్కిన కప్ప బైటపడటంకోసం వెర్రిగా, దీనంగా అరుస్తోంది. మధ్యమధ్య నక్కల కూతలు వినిపిస్తున్నయ్. నల్లమబ్బుల్లో తెల్లరెక్కల్ని మెరిపిస్తూ కొంగల బారులు దూసుకుపోతున్నయ్.

మనిషి అక్కడే వున్నా కమల మనసు ఎక్కడోవుంది.

"రాతంతా ఎల్లా ఏడిచిందో నీ ముద్దులు కూడా అల్లాగే తగలడుతున్నయ్. ఇంకా దీపం పెట్టవేమే పాపిష్టిదానా!" అంటూ తల్లి కర్కశంగా అరిచింది.

వొణుకుతున్న వేళ్లతో కమల అగ్గిపెట్టె కోసం తడుముకుంది. మరుక్షణంలో వెలిగింది దీపం! ఆ శ్రావణసంధ్యాంధకారంలో భగున వెలిగింది!



సుశీలకి ఎలికని చూసినా పిల్లిని చూసినా చచ్చేభయం. తండ్రి ఆమెకొక రోజున ధైర్యం గురించి గంటసేపుబోధించాడు. సుశీల ఇలా అడిగింది.

"నాన్నా! నీకు ఆవును చూస్తే భయం లేదా?"

"ఊహూ"

"పెద్దపులి అంటే భయం లేదా?"

"ఊహూ"

"పిడుగులు పడుతున్నప్పుడు?"

"ఊహూ"

"ఎంత ధైర్యం నాన్నా! అమ్మంటే తప్ప ఇంకెవ్వరన్నా నీకు భయం లేదన్నమాట!" అని సుశీల ఆశ్చర్యపడింది.

"నవ్వుతూ అన్నావే కమలా! ఆ గోనే శనగలు" అంటూ చిరునవ్వులు చిందిస్తూ విమల మళ్ళొచ్చింది. గదిగుమ్మంలోంచి "కమలా! కమలా! అయ్యో అయ్యో!" అని దిక్కులు దద్దరిల్లేట్లు అరిచింది. అరుపు విని పరుగున వొచ్చినవాళ్ళ ఆ దుర్భర దృశ్యాన్ని చూడగానే విరుచుకుపడిపోయింది.

అర్ధరాత్రిలాగా వున్న ఆ శ్రావణసంధ్యలో కమల ఇటువంటి సంజదీపం వెలిగిస్తుందని ఎవరనుకున్నారూ? ★

Edited Printed & Published by S. Sambhu Prasad at the Andhra Patrika Press, 7, Thambu Chetty St Madras.



పంచతంత్రం

# మిత్రభేదం

కర్త... విశ్వాత్ముల నరసింహమూర్తి



"అదుగో అక్కడ వున్నాడు!
మీరిక్కడనే పొదలో దాక్కొని
అంతా చూస్తూ కూర్చోండి."



నక్కా, కాకీ పొదల మాటునే
దాక్కొని చూస్తూ వున్నాయి.



సింహం ఒంటిగ ముందుకు వెళ్ళి
పలుకరించినది బత్తుణ్ణి.



...మూటను విప్పబోవుచూ
...క్కలను ఏవో మృగాలు
...ఉండుటను చూచాడు.



మూటను గబగబ సర్దుకొని
చెట్టుపైకి ఎగబ్రాకాడు!



"అదేమి బావా! చెట్టెక్కితివే?"
"ఈరోజున మీరెవ్వరినో
వెంటబెట్టుకొని వచ్చారు!"



...రు మనవాళ్ళేనయ్యా!"
"మనవాళ్ళో, మరిపరాయివాళ్ళో
ఈ నక్కలనూ, ఈ కాకులనూ
నమ్మను బాబూ,
ఛస్తే నమ్మను!"



"దిగు దిగు బావా,
దిగవోయ్ బావా!"



"దిగను దిగను,
మరి దిగనోయ్
బావా!!"



పట్టిపట్టి ఇక
లాభం లేకను
సింహం వెనక్కి
పోయింది



...వకుడు దమనకునితో:
అందులకే, ఈ రాజులస్నేహం
వద్దని పెద్దలు చెబుతారు.....
ఏమైనా యిక యుద్ధం కన్నా
వేరేమార్గం లేదనుకుంటూ....



దమనకుడు: (ఆనలో)
"కొంపతీసి ఈ సంజీవకుడే
రాజును కాస్తా చంపేస్తే—!?
వీడికి ధైర్యం చెదిరేటందుకు
ఠస్సా ఏదో వేస్తాను."



"అబ్బే, అబ్బే! యుద్ధం దేనికి?
వెనుకటి తలువు పెట్టకుమల్లే
యుద్ధంకంటే వేరే మార్గం
వెదకాలయ్యా సంజీవయ్యా!"



Rgd No M 4479

## సిద్ధముగా నున్నది.




ఈ కథ 1547 వ సంవత్సరంలో ఇంగ్లండులో జరిగినట్లు వ్రాయబడింది. ఆ రోజుల్లో ఇంగ్లండు దేశంలో ప్రజలు ఎలా జీవించేవారో, వారి ఆచారవ్యవహారాలు, కష్టసుఖాలు ఎలాంటివో ఈ నవలద్వారా బాగా తెలుస్తాయి

వెల రెండు రూపాయిలు

అనువాదం నండూరి రామమోహనరావు

# ఆంధ్రగ్రంథమాల

మద్రాసు 1.